విశ్వసాహిత్యమాల 63



# యూదుల చరిత్ర



గ్రంథకర్త:

శ్రీ ఖండవల్లి బాలేందుశేఖరం ఎం. ఏ.,

లెక్చరర్, ఉస్మానియా కళాశాల, వరంగల్.





1956 జనవరి

విశ్వసాహిత్యమాల, రాజమండ్రి.

2

# యూదుల చరిత్ర

## YUDULA CHARITRA

By.

K. BALENDU SEKHARAM M.A..

ప్రథమముద్రణ 1956

మోడరన్ ప్రెస్, రాజమండ్రి.

వెల రు. 1-8-0 1000 ప్రతులు.

# పీఠిక

'యూదులు' అను మాట వినడంతోనే మనకు బైబిలు గుర్తొస్తుంది; పాలస్తీను దేశం జ్ఞాపకం వస్తుంది; మోజెస్, జీసస్ మొదలైన మహనీయులు స్మృతిపథాన నిలుస్తారు. మానవ జాతు లనేకములు యీ భూమండలం మీద యిరువదివేల యేండ్లుగానైన ఆయా చోట్లలో నివసిస్తూ, ఆర్థిక సాంఘిక మత రాజకీయాది వ్యవస్థలను నిర్మించుకుంటూ వచ్చినట్లు మన కెన్నో ఆధారాలు దొరికినాయి. ప్రాచీనకాలమునుంచి అనేకజాతులు ప్రకృతితో పోరాడుతూ, తమ జీవనోపాధికై యెన్నో పరికరాలను నిర్మించుకుంటూ వచ్చినాయి. అనేక జాతులు యిరుగుపొరుగు జాతులతో పోరాడుతూ, అనేక యుద్ధసాధనాలను నిర్మించుకుంటూ వచ్చినాయి. ప్రకృతి శక్తులను గూర్చిన యోచనలనూ, సిద్ధాంతాలనూ గావిస్తూ వచ్చినాయి. స్వీయానందమునకై వివిధ కళారూపాలను నిర్మించి, అభివృద్ధిగావిస్తూ వచ్చేయి. వాటినన్నిటినీ బట్టే ఒక జాతియొక్క నాగరికతను, సంస్కృతిని నేడు మనం ఊహించ గలం. దేవాలయాదులలో శిల్పము, కుడ్యచిత్రములు; దైవ ప్రార్థనము, వీరపూజ, ధర్మబోధ మొదలగు వాటికై కవిత్వము, సంగీతము; జీవనోపాధికై, తలదాచుకొనుటకై కృషి

వాస్తు వాణిజ్యములు, తత్సాధనములు; అలంకారమునకై నగలు, స్వర్ణకారాది వృత్తులు, యుద్ధమునకై ఆయుధ నిర్మాణము, ఆయుధవిద్య, లోహవిద్యలు; రోగనివారణకై మందులు మాకులు; యిల్లాటివెన్నో ఆయాజాతులు సాధించి, తమ ముందుతరాలవాళ్లకి యిచ్చి పోతూండేవాళ్లు. ఆయా విద్యలు గ్రంథరూపంలోనూ, కవిత్వరూపంలోనూ, సాంప్రదాయకంగానూ అందించబడుతూ వచ్చేయి. వీటిని బట్టే ఏ జాతి, ఎప్పటినుంచి, ఎంతవరకూ సంస్కారం, విజ్ఞానం గలదో శాస్త్రజ్ఞులు నిర్ణయిస్తారు.

అనేక నాగరికతలు నశించి, కాలగర్భంలో కలిసి పోయినాయి. వాటి ఆనవాళ్లేనా నేడు మనకు లభించవు. కాని, కొన్నిజాతులు అత్యంత అభినివేశంతో తమ సంస్కారాన్ని నిలబెట్టుకుంటూ వచ్చేయి. వాఙ్మయం, లిపి, సాహిత్యం, శిల్పశిథిలాలు, యివి మాత్రమేగాక ఆయా పురాతనజాతులు యింకా సజీవంగా ఉండడమూ చూస్తాము. వాటిలో యూదు జాతి ఒకటి. ఈ జాతి తన తొల్లింటి పాటవాన్నింకనూ గోల్పో లేదు. ఆధునిక వైజ్ఞానిక యుగంలో అనేక మహద్విషయా లను కనిపెట్టి, అద్వితీయమేధావులని పేరుగన్న మహనీయు లెందరినో యూదుజాతి గన్నది. ఇటీవలనే కీర్తికాయుడైన ఆల్బర్ట్ ఐన్‌స్టీన్ యూదుజాతివాడే. పదిహేడో శతాబ్దంలోని

గొప్పతత్త్వవేత్త స్పినోజా, 19 వ శతాబ్దిలోని రాజకీయవేత్త డిస్రేలీ; సంగీతవేత్త మెండెల్‌సోన్; చిత్రకారులు పిస్సారో, లీబర్‌మన్‌లు, మహాకవి గెథే; మనోతత్త్వశాస్త్రవేత్త సిగ్మండ్ ఫ్రాయిడ్; కొన్ని శతాబ్దములుగా యూరోపులోని రాజకీయాలనే నిర్ణయించగల ధనికులై తమ వదాన్యతకు, ధార్మికసంస్థల నేర్పాటు చేయుటకు ప్రసిద్ధికెక్కిన రాత్‌ఛైల్డ్ కుటుంబం,- వీరందరూ యూదుజాతికి చెందినవారే.

ప్రతి జాతిలోనూ కొన్ని ప్రత్యేకత లుండడం చారిత్రక సత్యము. అట్లే యూదులలో తీవ్రమైన పట్టుదల, కష్టసహిష్ణుత, విజ్ఞానపిపాస ఉండడం మనం చూస్తాము. కొన్ని చారిత్రక కారణములవల్ల, పరిస్థితులవల్ల ఆయా జాతులలో గల ప్రత్యేకగుణములు పరాకాష్ఠ చెందుతూ వుంటాయి. పరిసరపరిస్థితులకు తన్నుదా సరిపెట్టుకొను లక్షణము మానవునిలో యితర ప్రాణులకన్న అధికము. పరిస్థితులకు లొంగిపోక, వాటి నధిగమించగలిగిన ప్రాణులే మనగలిగినట్లు, మానవ నాగరకతలలో కూడ పరిస్థితుల నధిగమించి పురోగమించగలిగినవే నిలువగలిగినాయి. వాటిలో యూదుల నాగరకత యొకటి యనుట నిస్సందేహము.

అట్టి యూదుజాతి చరిత్రనుగూర్చి శ్రీ ఖండవల్లి బాలేందుశేఖరంగారు రచించిన యీ గ్రంథమును పాఠకలోకం

ముందుంచుతూన్నాము. ప్రాచీన జాతులు, వాటినాగరకతా సంస్కృతులు గూర్చిన చరిత్రలు ఆంధ్రభాషలో తగినన్ని వెలువడియుండలేదు. అట్టి చారిత్రక గ్రంథములను మరికొన్నింటినికూడ వెలువరచదలచితిమి.

వివిధ ప్రదేశములో, వేర్వేరు కాలములలో అనేక మానవకుటుంబాలు వర్ధిల్లి, జీవించి, వికసించియున్నాయి. అప్పటి కుటుంబాలు అంటే తెగలనే చెప్పవచ్చును. వారివారి వైజ్ఞానిక తాత్త్వికసాహిత్య కృషులు ఆ జాతిలోనే ఆగిపోక తమ సౌరభములను చుట్టుపట్లకంతకూ వ్యాపిస్తూనే వుండేవి. అందుచేతనే యే ఒక జాతి సంస్కృతి, అనేకయితరసంస్కృతుల ప్రభావముద్రలుగలదే ఐవుంటూ వచ్చింది. నేటి మానవ సంస్కృతి ఒకమహాసాగరాన్ని పోలినది. దీనిలో యెన్నెన్నో జాతీయ సంస్కృతీ ప్రవాహాలు వచ్చి కలిసినాయి. కొన్ని ప్రవాహాలు నేడు నామమాత్రావశేషములై, కేవలం చాలు మాత్రమే కనిపించుతూ శుష్కప్రాయములైనాయి. మరికొన్ని ప్రవాహములు పరిపుష్టములై, సజీవంగా, విశాలంగావున్నాయి. ఇచ్చి పుచ్చుకోడాలు లేనిదే యేదీ సజీవంగా ఉండజాలదు. అట్లాగే సంస్కృతీ నాగరకతలున్నూ.

నేడు సజీవములై వున్న జాతుల, సంస్కృతుల చరిత్రలే గాక, కథావశేషములైన జాతుల, సంస్కృతుల చరిత్రలు

కూడ మనకు పఠనీయములే. ఆంధ్ర పాఠకమహాశయులు మాకు తగుప్రోత్సాహము నిచ్చినచో మరికొన్ని గ్రంథములు కూడ త్వరలో ప్రచురించగలమని మనవి.

చరిత్రలనూ, జీవితచరిత్రలనూ విశ్వసాహిత్యమాల వరసగా ప్రచురించుతుంది. వైజ్ఞానిక గ్రంథాలను సామాన్య పాఠకునికోసం వ్రాయించి వెలువరచబోతూన్నాము. పిల్లలనూ, వయోజనులనూ దృష్టిలో పెట్టుకొని, జాతీయ జీవన రంగాన్ని ఫలవంతంగా చేయబూనుకొని, ఆంధ్రభాషను తత్సాధనంగా గొని, వివిధశాఖలలో ఉద్గ్రంథాలను ప్రచురించుతూ ప్రజాసేవాధర్మమును కొనసాగించుతూన్న మాకు తెలుగుదేశంలోని విద్యాధికులు, గ్రంథాలయాలు, భాషాభిమానులు పరిపూర్ణ సహకార మొనర్చగోరుచు సెలవు దీసుకుంటాము.

20–1–1956,
రాజమండ్రి.

మహీధర జగన్మోహనరావు
సంపాదకుడు.

# విషయసూచిక

## యూదుల చరిత్ర

8A




క్రీస్తు పూర్వము మధ్యధరా సముద్రప్రాంత దేశములు.

# యూదుల చరిత్ర

## ప్రాచీన యుగము

యూదులొక అసామాన్యమైన జాతివారని తెల్పుటలో అతిశయోక్తి ఇంచుకయును లేదు. ఈ జాతి ప్రపంచమందలి అతిప్రాచీన జాతులలో నొక్కటి. కాని ఇతర ప్రాచీనజాతుల వలె యూదులు తమ వైశిష్ట్యతను గోల్పోయి, చారిత్రిక గ్రంథ పత్రములయందు మాత్రమే కానవచ్చు నొక మృత జాతివారుకారు. క్రైస్తవవేదమగు బైబిలు గ్రంథమునందలి ప్రథమభాగమున— అనగా పాతనిబంధన అను పర్వము నందు యూదుల చరిత్ర సవిస్తరముగ లిఖింపబడినది. కావున వీరు ఏబదిశతాబ్దులకు పైబడిన కాలమునందు సైతమొక ప్రత్యేకజాతిగ నేర్పడియుండిరని నిస్సంశయముగ తెలుప వచ్చును. అంతటి ప్రాచీనయుగమునాటి యూదుజాతి నేటికిని సజీవమై, ప్రపంచమందన్ని దేశములందును తన ప్రతినిధుల నెలకొల్పుటయేకాక, ఒక ప్రత్యేక రాష్ట్రమును స్థాపించి నిత్య నూతనోత్సాహముతో వర్ధిల్లుచున్నది. ఈ ఒక్క అంశమే యూదుజాతి యందుగల అసామాన్య దార్ఢ్యము, పటిమను ప్రదర్శించుచున్నది. సుదీర్ఘమగు నీ చరిత్రయందు యూదులు సుఖముగ కాలక్షేపము చేసినవారుకారు. ప్రపంచమందలి

అన్ని జాతులకును ఆయా సందర్భములందు ఆపదలును, ఘోర విపత్తులునుకూడ సంభవించినమాట నిజము. కాని యూదు జాతివా రనుభవించిన కష్టములకును, అవమాన పరంపరలకును ప్రపంచ చరిత్రయం దెచ్చటను జోడు లేదు. యూదుజాతి అతి ప్రాచీనమగు ఈజిప్టు, కాల్డియా, ట్రాయ్ జాతులకు సమకాలీనమైనది. వీరు నిరంకుశులగు "ఫారో" ప్రభువులను ధిక్కరించిరి. మహావీరులగు అస్సీరియా జాతివారి గర్వ మడ గించిరి. కొంతకాలము వీరు బాబిలోనియా రాజ్యమునకు లోబడి స్వదేశమగు పాలస్తీనమునుండి ప్రవాసమనుభవించిరి. కాని ఈకాలమందుకూడ వారు స్వదేశాభి మానమును వీడక, బాబిలోనియా రాజులు బలహీనులగుటతోడనే తమ పైతృక రాజ్యమునకు మరలివచ్చిరి. జగత్ప్రసిద్ధిగాంచిన గ్రీకు నాగరి కత వీరికండ్లముంగట పుట్టి, పెరిగి, ఉత్తమపథముల కెగిరి, తుదకు నశించెను. రోమక సామ్రాజ్యముకూడ చిరకాలము వరకునుకూడ యూదు రాజ్యమునకు సమకాలీన ప్రభుత్వముగ నెగడెను. ఈ కాలముననే యూదుల చరిత్రయందు రెండు మహత్తర సంఘటనలు సంభవించెను. క్రైస్తవ మతస్థాపకు డగు క్రీస్తు యూదుజాతియందే జన్మించి, ప్రాచీన మతమునకు భిన్నమగు వేరొకమతమును నెలకొల్పి తుదకు తనజాతివారిచే తనే నిహతుడయ్యెను. రోమక జాతివారు ప్రబలులై యూదు లను వారి స్వరాష్ట్రమగు పాలస్తీనమునుండి వెడల నడచిరి. ఈ యుగమునుండియే యూదుల కష్టములు ప్రారంభించెను.

పాలస్తీనమునుండి తరిమివేయబడిన యీ జాతివారు ప్రపంచ మందలి వివిధ దేశములకు వెడలిపోయి, చెట్టుమీద పక్షులవలె నిరాధారులై సుమారు రెండువేల సంవత్సరములు ప్రవాస దుఃఖము ననుభవించిరి. తమ మతప్రవక్తయగు ఏసుక్రీస్తును సిలువ వేయించిరను నెపముపై క్రైస్తవ జాతు లన్నియు యూదులను మిక్కిలి ద్వేషము, జుగుప్స, వైరము మున్నగు భావములతో పరిగణింపసాగెను. ప్రాచీనయుగమునందును, మధ్యమ యుగమునందును, ఐరోపాఖండమునందు యూదు లనుభవించిన కష్టములను, దౌర్జన్యములను, నిరంతర పీడ నమును వర్ణించుటకు భారతమంత యొక మహాగ్రంథము కావలయును. అత్యంత విషాదకరమైన ఆ గాథను వినినప్పుడు నల్లరాళ్లైన కరుగకమానవు. సుమారు ఇరువది శతాబ్దుల కాల మీ దుఃఖసాగరము నీది తుదకీ వర్తమాన శతాబ్దమున యూదుజాతి పాలస్తీనమందొక గౌరవస్థానమును సంపాదించి నది. ఇట్టి జాతి యొక్క అపూర్వగాథను విని, ఎంతటి నిర్లిప్తుడునుకూడ ఔనని తలయూపక మానడు.

ఇన్ని శతాబ్దులకాలము జీవించి, ఇంతటి కష్టపరంపరల నతిక్రమించి సజీవముగ నుండుటయే కాక యూదులు తమ వ్యక్తిత్వమును కూడ నేటివరకును చెడకుండ నిలువబెట్టుకొని యున్నారు. యూదుజాతి ప్రాచీనకాలమునుండి నేటివరకును కూడ మిక్కిలి పరిమితముగ నున్నది. సంఖ్యాబలము వారి కెన్నడును లేదు. కాని ఎంతటి అల్పసంఖ్యాకులుగ నున్నను

యూదుజాతివారు అధికసంఖ్యాక ప్రజలలో లీనమై పోకుండ తమ వైశిష్ట్యతను సంరక్షించుకొనుట ముఖ్యముగ గమనింప దగి యున్నది. శీలమునందును, బుద్ధివిశేషమునందును, రూపు రేఖలయందును, ప్రాచీనకాలపు యూదులకును, ఈనాటి యూదులకును ఎంతమాత్రమును భేదము లేదు. నినేవా నగర మునందలి కట్టడములపై చెక్కబడిన యూదుల ప్రతిమలకును ఈ నాటి యూదులకును ఆకార మొక్కటియే. ప్రాచీనకాల మున యూదులలో కాన్పించిన కార్యోత్సాహము, ఈ నాటి వారిలో నెంత మాత్రమును కూటువడ లేదు. భాష, వాఙ్మయము, ఆచారవ్యవహారములు, సాంప్రదాయములు, అన్నియు కూడ యూదులలో ఆనాడును నేడును కూడ యథాతథముగ కాన్పిం చుచున్నవి. అన్యజాతుల సంపర్కముచే మార్పు చెందక, తన వైశిష్ట్యతినుసంపూర్ణముగనిలువబెట్టుకొనిన వారొక్క యూదు ప్రజలేయని చారిత్రికులు తెల్పుచున్నారు. ఏ దేశమున నివసిం చినను, ఎట్టిపరిస్థితులలో నున్నను తామందరము నొక జాతికి చెందినవారమను భావమును విడనాడకుండ మెలగుచున్నారు.

ప్రాచీనకాలమునుండి నేటివరకును కూడ యూదులు ప్రదర్శించిన బుద్ధికౌశల్య మనన్యసామాన్యమైనది. ఆ విషయ మును సమర్థించుటకై నిదర్శనములు లెక్కకు మించియున్నను, వాని నిచ్చట ఉదహరించుటకు వలనుపడదు. కాని ప్రపంచమం దే దేశముననైన అపూర్వమగు విజ్ఞానాభివృద్ధి కల్గినను, నూతనమగు ఉద్యమము తలయెత్తినను, కళ లపూర్వవికా

సము చెందినను, పరిశ్రమలు విజృంభించినను, దానికి ప్రత్యక్షముగ కాని, పరోక్షముగ కాని యూదు జాతితో సంబంధముండి తీరినదని తెల్పిన చాలును. ఈ జాతియందుగల మరియొక లక్షణము ప్రత్యేకముగ గమనింపదగి యున్నది. అది వారి ఆత్మవిశ్వాసము. పరమేశ్వరుడు తన యపూర్వ తేజము యూదు జాతియందు ప్రకాశింపజేసెనని బైబిలు గ్రంథమునందొక ప్రార్థనాగీతము వ్రాయుచున్నది. ప్రపంచ జాతులలోనెల్ల తా ముత్తమోత్తముల మను భావము యూదుజాతి వారిలో నేటికిని నెలకొని యున్నది. తమ్ము నాయకులుగ వరించిన పక్షమున ప్రపంచమును నేడెదుర్కొనుచున్న మహత్తర సమస్య లేనాడో అవలీలగ పరిష్కరింపబడి యుండెడివని యూదులవిశ్వాసము. ప్రాచీన యుగమునందును, ఆధునిక యుగమునందును మానవాభ్యుదయమునకై యూదులు కావించిన సేవను గుర్తెరింగినవారికి యూదుల ఆత్మవిశ్వాసము కేవల మహంకారము కాదని తెలియవచ్చును.

ఐరోపాఖండమునందు సామాన్య జనులకు యూదులు యెడ నిరసనభావమును, ద్వేషమును నేటివరకును కూడ ప్రబలి యున్నవి. యూదులు పరమ లోభులని యొక దుష్ట ప్రవాదము వ్యాపించియున్నది. వారు దయాదాక్షిణ్యములు లేని రాక్షసులుగ ఇటీవలవరకును వాఙ్మయ ప్రపంచమున చిత్రింపబడిరి. యూదులలో ధనార్జనాసక్తి విస్తారముగ నున్న విషయము సత్యదూరముకాదు. వారు క్రైస్తవుల యెడ ద్వేష

భావముతో వర్తించిన ఘట్టములుకూడ పెక్కులు కలవు. కాని యూదుల సమగ్ర చరిత్రను శ్రద్ధగ పరిశీలించినవారికీ యసామాన్యలక్షణములు ఆ జాతియందెట్లు వృద్ధినందెనో గ్రహించుట కష్టముకాదు. క్రైస్తవయుగారంభము నుండియు యూదులపై సామాజికముగను, రాజకీయముగను అనేక నిర్బంధములు విధింపబడెను. వారు క్రైస్తవప్రజలు నివసించు ప్రదేశములలో నివసింపరాదు. యూదులకొరకై మాలపల్లెల వంటి ప్రత్యేకమగు వాడలు ఏర్పరుపబడెను. ఆ వాడల నెట్టి సందర్భములందును విస్తరించుటకు వలనుపడదు. యూదుల కెట్టి యాస్తి పాస్తులను సంపాదించుటకును అధికారము లేకుండెను. అనేక శతాబ్దుల కాలమిట్టి క్రూరములును, అమానుషములు నగు నిర్బంధముల ననుభవించిన జాతియందు కొన్ని వికృత లక్షణములు సంక్రమించుట అసామాన్యము కాదు. యూదు జాతి సహజముగ చేవగల జాతి. వారికిగల ప్రజ్ఞా విశేషము లసామాన్యములైనవి. అసాధారణ మానవుని యందు ద్యోతకమగు సర్వలక్షణములును అసామాన్యముగ నుండుట సహజము. మంచియును చెడ్డయునుకూడ వారియందత్యంత గురుత్వముతో భాసిల్లును. కావున యూదులలో విపరీతమగు ధనలోభమును, తమ ప్రతిస్పర్థులగు క్రైస్తవ ప్రజల యెడ ద్వేషమును పెంపొందెను. వీనిని కారణముగ గైకొని క్రైస్తవులు యూదులను మరింత ద్వేషింప సాగిరి. కాని ఆధునిక యుగమున భావ వికాసము పెంపొందిన కొల

దియు క్రైస్తవ ప్రజలు యూదులు యెడ ద్వేషభావమును కొంతవరకు మరచిపోయి వారిని కూడ తమతో సమానులుగ భావింప దొడగిరి. సామాజిక రాజకీయ నిర్బంధనములు తొలగింప బడెను. అది మొదలుగ యూదులు తమ వికృత స్వభావమును విడనాడి, తమ సర్వశక్తులను నిర్మాణ మార్గమున వినియోగించుచు గౌరవమునకు పాత్రులగుచున్నారు. కావున యూదు జాతి యందు సహజ దౌష్ట్యము కలదని తలంచుట మిక్కిలి పొరపాటు.

## పాలస్తీనము

పాలస్తీనమును యూదు ప్రజలు స్వరాష్ట్రముగను పుణ్యభూమిగను కూడ పరిగణించుచున్నారు. ఇయ్యది సిరియా దేశములోని నైఋతి భాగమునందుగల చిన్న రాష్ట్రము. ఒక ఎత్తైనకొండపై నిలువబడిన పక్షమున నీదేశపు ఎల్లలను సులభముగ చూడవచ్చును. దీనికి దక్షిణమున అరేబియా దేశపు కొండలును, ఉత్తరమున లెభనాన్ కొండలును కలవు. పశ్చిమమున మధ్యధరాసముద్రము కలదు. తూర్పుభాగమున పాలస్తీనపు పంటభూములు క్రమక్రమముగ మరుప్రదేశముగ మారుచున్నవి. విస్తీర్ణతయం దీ దేశము మిక్కిలి చిన్నది. కాని ఇందు వివిధములగు ప్రకృతిదృశ్యములు చూపరుల కాశ్చర్యము కల్గించును. లెబనాన్ కొండల కుత్తర తమ భాగ

మున పర్వతాగ్రము లెల్లప్పుడును మంచుతో కప్పబడి యుండును. వీనియందలి యెత్తైన లోయలలో కూడ వృక్షములును సస్యములును కానవగును. ఈ కొండల పార్శ్వములందు దట్టమైన యడవులు వ్యాపించియుండును. ఈ పర్వతపంక్తుల నుండి యించుక దక్షిణముగ దిగివచ్చిన పక్షమున భూమి యంతయు పైరుపంటలతో కన్నులపండువగ నుండును. దక్షిణ పాలస్తీనమునందలి భూమి సారవంతమైనదికాదు. అచ్చటి కరేబియా ఎడారులు మిక్కిలి సమీపముననుండును. కావున భూమి యంతయు ఇసుకతో నిండియుండి, ఎట్టిసస్యములుకాని, వృక్షములుకాని, తుదకు పచ్చనిగడ్డికాని పెంపొందుటకు అననుకూలముగ నుండును. పాలస్తీనపు టుత్తర ప్రాంతము నుండి జోర్డన్ అనునొకనదిదక్షిణాభిముఖముగా ప్రవహించుచుండును. ఇయ్యది ఎత్తైనకొండల మీదినుండి సముద్రప్రదేశములకు క్రమక్రమముగా దిగివచ్చును. కాన నీ నదీ ప్రవాహమునందనేక జలపాతములు కానవగును. ప్రథమ దశయందు డాంబరముగను భీకరముగను కానవచ్చు జోర్డన్‌నది సమ ప్రదేశములందు శాంతముగ ప్రవహించి తుదకు దక్షిణపు టెడారియందు ప్రవేశించి క్షీణసత్వమై "నిర్జీవసముద్రము" (Dead Sea) అనబడు సరస్సునందు లీనమైపోవును. పాలస్తీనమునందు తూర్పు దక్షిణ ప్రాంతములు ఎడారులవలె కాన్పించినను, ఒకకాలమున ఆ దేశమునందలి మధ్యభాగమును, ఉత్తర పశ్చిమ ఖండములును, ఈ కొరతను సంపూర్ణముగ

తీర్చినైచి వనలక్ష్మికిని సస్యదేవతకును విహారభూమివలె నిరంతరము కలకల లాడుచుండెడివి. పంటలకాలము నందిచ్చట భూమి యంతయు వివిధ సస్యములతో నిండి యుండును. పర్వత పాదమున వేర్వేరు మట్టములలో విశాలమైన క్షేత్రముల కనువగు చదునునేలలు కానవచ్చుచుండెను. ఆ క్షేత్రములలో పాలస్తీనపు రైతులు ద్రాక్షతోటలను పెంచుచుండిరి. ఈ ప్రదేశములలో ఆలివ్ వనములు విస్తారముగ కాన్పించుచుండెను. కొండలకు దిగువగల సమప్రదేశములలో తాటి వనములు పెరుగుచుండెను. కొండలపై మిక్కిలి ఉపయోగకరములగు వృక్షములు చాల ఏపుగ పెరుగును. ఈ ప్రాంతములందు గడ్డిమైదానములు విస్తారముగ కాన్పించెడివి. వీనియందు గొఱ్ఱెలు, ఆవులును, మందలు మందలుగ విహరించుచుండెను. కావుననే ప్రాచీనకాలమునందలి యూదులు పాలస్తీనము సర్వసస్య సమృద్ధమైన దనియు. భూలోకస్వర్గ మనియు కొనియాడెడివారు. రోమను సామ్రాజ్యము యూదులను వారి స్వరాష్ట్రమునుండి వెడలనడచిన తరువాత భౌతికముగ పాలస్తీనమునకు హీనదశ సంప్రాప్తమయ్యెను. కాని ఈ నాటి యూదు ప్రభుత్వము తమ దేశమునకు తొల్లింటి ఉచ్చదశను కల్గించుటకై యత్నించుచున్నది. ప్రాచీన యుగమున యూదురాజ్యమునకు "ఇజ్రాయిల్" అను పేరుండెను. ఆధునిక యుగమున కూడ మరల ఆ నామమే వాడబడుచున్నది.

# యూదుజాతిమూలపురుషుడు అబ్రహామ్

యూదులు సెమిటిక్ జాతికి చెందినవారు. నోహా అను పురాణపురుషునికి ప్రథమపుత్రుడైన షెమ్ అను నాతడు సెమిటిక్ జాతికి మొదటివాడు. ఆతని సంతతివారు కాలక్రమమున మిక్కిలి అభివృద్ధిచెంది వివిధ దేశములలో వ్యాపించిరి. ప్రాచీనకాలపు కాల్డియా, బాబిలోనియా, అస్సీరియా జాతులవారును, ఈ కాలపు అరబ్బులును కూడ సెమిటిక్ తెగకు చెందినవారు. ఈ సెమిటిక్ తెగయందు అబ్రహామ్ అను ప్రసిద్ధపురుషుడు జన్మించెను. ఈతడు బాబిలోనియా రాజ్యములోని "ఉర్" పట్టణమున నివసించుచుండెడివాడు. కాని క్రమక్రమముగ నీ పట్టణము క్షీణింపసాగెను. కావున అబ్రహామ్ ఆ ప్రదేశమును వీడి హారాన్ అను మరియొక పట్టణమునకు వలస పోయెను. వలస పోయినప్పుడు అబ్రహామ్ తండ్రియైన టెరా జీవించియుండెను. అబ్రహామ్‌తో ఆతని సోదరుడగు నేహర్ అను వాడును, పినతండ్రి మనుమడగు లాట్ అనువాడును, వారి భార్యలును, ఇతర జనులును ఉండిరి. హారాన్ పట్టణము బాబిలోనియా రాష్ట్రపు టుత్తర సరిహద్దులో నుండెను. కొంతకాలమునకు టెరా మరణించెను. నేహర్ హారాన్ పట్టణములోనే నివాసముగ నుండిపోయెను. కాని అబ్రహామ్ అచ్చటనుండి దక్షిణాభిముఖముగ వెడలి కానాన్ రాష్ట్రమును చేరెను. కానాన్ పాలస్తీనమునకు

నామాంతరము. ఈ రాష్ట్రము నందా కాలమున పరిపాల
నము కావించుచున్న ప్రభువులు బాబిలోనియా రాజులకు
సామంతులుగ నుండుచు వచ్చిరి. అంతేకాక బాబిలోనియా
ప్రజలును కానాన్ ప్రజలును ఒండొరులతో వర్తక సంబంధ
ములు కల్గియుండిరి. బాబిలోనియా భాషయు ఆచార వ్యవ
వ్యవహారములును కానాన్ ప్రజలయందు వ్యాప్తి చెందియుం
డిన కారణమున అబ్రహామ్ను, అతని కుటుంబమువారును
కానాన్ ప్రజలతో సులభముగ నిమిడిపోయిరి. వీరు కానన్
రాష్ట్రమును చేరిన అనతికాలములోనే అచ్చట కాటకము
సంభవించెను. కావున అబ్రహామ్ సకుటుంబముగ ఈజిప్టు
దేశమునకు తరలిపోయెను. ఈ దేశము వర్షమాతృకము
కాదు. నైలునది యనుగ్రహము వలన యిచ్చట యెల్లప్పు
డును చక్కని సస్య సమృద్ధి యుండును. ఈ కాలమున
నిచ్చట రాజ్యము చేయుచున్న వంశమువారు హిక్సోసు
వారు. వారికి అరబ్బులతో సన్నిహితసంబంధ ముండెను.
అబ్రహామ్ కూడ ధనికుడును, ఉన్నత వంశీయుడును, తమ
జాతితో సన్నిహితత్వము కలవాడును అగుటచే ఈజిప్టు రాజ
వంశము వారీతనిని మిక్కిలి గౌరవముతో నాదరించిరి.
పై గాథ యంతయు క్రీస్తునకు రెండువేల సంవత్సరములకు
పూర్వము నాటిది. కొంతకాలము వరకును ఈజిప్టు దేశమున
సకుటుంబ సపరివారముగ నివసించి అబ్రహామ్ మరల పాలస్తీన
మునకు తిరిగి వచ్చెను.

ఇంతవరకును లాట్ అను సమీపజ్ఞాతి ఆబ్రహామ్‌తో నివసించుచుండెను. ఇప్పుడాతడు ఆబ్రహామ్ నుండి వేరుపడి నిర్జీవ సముద్రప్రాంతమున నివసింపసాగెను. ఇచ్చటి ప్రజలు విలాసప్రియులుగను, నీతిదూరులుగను ఉన్నట్లు తెలియుచున్నది. లాట్ ఆ ప్రజానీకములో అనతికాలమున లీనమైపోయెను. కొంతకాలము గడచిన తర్వాత ఎలామ్ దేశపురాజు దక్షిణ పాలస్తీనముపై దండెత్తివచ్చి, అచ్చటి చిన్నచిన్న రాజుల నోడించి పలువురు ప్రజలను చెరపట్టి వెడలిపోయెను. అట్లు చెరపెట్టబడిన వారిలో లాట్ ఒకడు. తన జ్ఞాతికి సంభవించిన అపాయమును విని ఆబ్రహామ్ ఎలామ్ రాజును వెంటాడి ఒకనాటి రాత్రి వారి సైన్యము నోడించి, తన జ్ఞాతిని చెర విడిపించెను. ఆబ్రహామ్ సంపాదించిన విజయము ఎలామ్ రాజుల పతనమునకు ప్రారంభము. అంతవరకును ఆ దేశపు రాజులు బాబిలోనియా రాజ్యముపై అధికారమును నెరపుచుండిరి. ఇప్పుడు బాబిలోనియావారు సైతము ఎలామ్ రాజుపై తిరుగుబాటుచేసి తమ స్వాతంత్ర్యమును ప్రకటించిరి. ఈ విధముగ ఆబ్రహామ్ తన మాతృదేశమగు బాబిలోనియా స్వాతంత్ర్యమునకు కూడ పరోక్షముగ కారణభూతుడయ్యెను.

కొంత కాలమునకు భగవంతుడు ఆబ్రహామ్‌కు దర్శనమొసంగి, ఆతని సంతతివారు లోకకళ్యాణమునకై ఎంతయో తోడ్పడుదురని తెలిపి అంతర్ధానమయ్యెను. అనతికాలములో ఆబ్రహామ్‌నకు ఐజక్ అను కుమారుడు కల్గెను. యూదుజాతికి

పితమైన ఈ ప్రాచీనపురుషుని చిత్తశుద్ధిని పరీక్షించుటకును, ఆతని కజరామరమగు కీర్తిని కల్గించుటకును భగవంతు డాతని నొక కఠినపరీక్షకు లోనుగావించెను. తన ప్రియపుత్రుడగు ఐజక్‌ను భగవత్ప్రీతిగ బలి యొసంగవలయునని అబ్రహామ్‌కు భగవదాదేశ మయ్యెను. ఆతడెంత మాత్రమును వెనుదీయక కుమారుని బలి యొసంగుటకు సిద్ధపడెను. బాలుడగు ఐజక్ కూడ యిందుల కంగీకరించెను. కాని బలిదాన మొసంగవల సిన సమయ మేతెంచుసరికి భగవంతు డాబ్రహామ్‌కు ప్రత్య క్షమై ఆతని భక్తికి మెచ్చితిననియు, ఆతని చిత్తశుద్ధిని పరీక్షించుటయే తన లక్ష్యమనియు, అగ్ని పరీక్షకు అబ్రహామ్ నిలువగల్గెననియు పల్కి, ఐజక్ ప్రాణమును రక్షించి అంతర్ధాన మయ్యెను. అబ్రహామ్‌కు పలువురు భార్య లుండిరి. వారివలన ఆతని కితరకుమారులు కల్గిరి. ఈ పుత్రులు కూడ ప్రసిద్ధములైన తెగలకు మూలపురుషులై కీర్తిగాంచిరి.

## జోసెఫ్

అబ్రహామ్ మనుమడైన జేకబ్ అను నాతడు యూదుల చరిత్రయందు కొంత ప్రాముఖ్యత కల్గియున్నాడు. ఐజక్‌నకు ఈసాయును జేకబ్‌ను జన్మించిరి. పెద్దకుమారుడైన ఈసా ఎక్కువ ప్రయోజకుడు కాక వ్యర్థముగ కాలక్షేపము చేయ సాగెను. జేకబ్ తన యన్నకంటె బుద్ధిమంతుడును యోగ్యు డును అయిన కారణమున ఈతనివలననే వంశాభివృద్ధి కల్గునని

తండ్రియును, సాటివారును తలంచిరి. చిన్నతనమందు జేకబ్ దుష్ప్రవర్తనుడై తన యన్నను మోసగించినందున, తండ్రి యీతని నింటినుండి వెడలనడచెను. కొన్ని సంవత్సరముల కాల మీతడు ప్రవాసము సల్పెను. ఈ కాలమున నీతడు వివాహముచేసికొని, సంతానవంతుడై గొప్ప ఐశ్వర్యమును కూడ సంపాదించెను. వయస్సు మరలిన తరువాత జేకబ్ స్వదేశమునకు మరలివచ్చి తన యన్నకు క్షమార్పణము గావించి పాపపరిహారము కావించుకొనెను. జేకబ్‌నకు చాలమంది పుత్రులుండిరి. కాని వారందరును దుష్టులగుటవలన తండ్రికి మిక్కిలి మనోవ్యథ సంప్రాప్తించెను. కాని వారిలో జోసెఫ్ అనువాడు మిక్కిలి యోగ్యుడును, తండ్రికి అభిమానపాత్రుడు నయ్యెను. ఈ కారణమున సోదరులీతనిని ద్వేషింప సాగిరి. వీరందరు నేకమై ఒకనాడు ఈజిప్టుదేశమునకు వ్యాపారము నిమిత్తమై పోవుచున్న కొందరువర్తకులకు తమ సోదరుడగు జోసెఫ్‌ను అమ్మివైచిరి. కాని జోసెఫ్ మిక్కిలి అదృష్టశాలి. సమర్థుడును. కావున నాతడనతికాలములో ఈజిప్టుదేశపు రాజగు "ఫారో" యనుగ్రహమును సంపాదించి ఉన్నత పదవుల నాక్రమింప గల్గెను. జోసెఫ్ ఈజిప్టు చక్రవర్తి యనుగ్రహమును సంపాదించిన విధమునుగూర్చి యొక ప్రసిద్ధగాథ కలదు. ఒకనాడు రాత్రి "ఫారో" కొక విచిత్రమైన కలవచ్చెను. ఆతనికి కలలో ఏడు చక్కగబలిసిన ఆవులును, నిండుగ పాలుపోసికొని కంటికింపుగనున్న ధాన్యపు వెన్నులును కానవచ్చెను. వానిని

చూచుచు రాజు ఆనంద నిమగ్నుడయ్యెను. ఇంతలో ఎచ్చటి నుండియో చిక్కి శల్యావశిష్టములైన ఏడుగోవులును, ఎండి వడు గులవలెనున్న ఏడువెన్నులును ప్రత్యక్షమయ్యెను. చిక్కి పోయిన ఆవులు బలిసిన ఆవులను కబళించెను. ఎండిపోయిన ధాన్యపు వెన్నులు చిక్కబట్టిన వెన్నులను మ్రింగివేసెను. ఈ కలయొక్క అంతరార్థము తెలిసికొనవలెనని రాజునకు పట్టు దల కల్గెను. కాని అతని ఆస్థానములోని వారెవ్వరును కూడ రాజునకు సంతృప్తికరమైన సమాధాన మొసంగజాలరైరి. అంతట జోసెఫ్ రాజువద్దకేగి స్వప్నమందలి విచిత్రసంఘటనల కీ విధముగ వ్యాఖ్యానము కావించెను. "ఫారో రాజు రాజ్య మేడు సంవత్సరములవరకును సర్వసస్యసమృద్ధమై, భాగ్య దేవతకు పుట్టినిల్లుగ నుండగలదు. కాని అటు తరువాత ఏడు సంవత్సరముల వరకును దేశమందు గొప్పకాటకము సంభ వించును. ఆ కాలమున పైరుపంటలు పూర్తిగ నశించును. పై యేడు సంవత్సరములలో ప్రజలు సంపాదించిన ధనధాన్య ములు తరిగిపోయి దేశమందు పేదరిక మేర్పడును." జోసెఫ్ తెల్పిన యంశములు మిక్కిలి సమంజసముగ నున్న కారణ మున రాజు ఆతని పలుకులను విశ్వసించి, ఆతనిని మిక్కిలి గౌరవించి తనకు మంత్రిగ నియమించుకొనెను. ప్రజలందరును జోసెఫ్‌ను గొప్పబుద్ధిశాలిగ మన్నింపసాగిరి. దేశమునకు సంభ వింపబోవుచున్న ఆపదను నివారించుటకై తగిన మార్గముల నన్వేషించు భారము జోసెఫ్‌పై మోపబడెను. ఆతడు ధరిత్రీ

మాత సస్యశాలినిమై అపారధాన్యరాసుల ననుగ్రహించిన సంవత్సరములలో ధాన్యమును సేకరించి, ఆ ధాన్యమునే కరవు కాలమందు ప్రజలకమ్మించెను. జోసెఫ్ మంత్రిత్వమును వహించిన కాలమున ఈజిప్తురాజ్యమున నొక ముఖ్యమగు వ్యావసాయిక సంస్కరణము కావింపబడినట్లు తోచుచున్నది. అంతకు పూర్వము దేశమందలి భూమియంతయును జమీందారుల వశమైయుండెను. సామాన్యప్రజ లెల్లరును వీరివద్ద నుండి భూమిని గైకొని సేద్యము చేయుచుండెడివారు. కాని వీరందరును ఇంచుమించు బానిసలవలె పరిగణింపబడుచుండిరి. జోసెఫ్ ఈ ఏర్పాట్లను మార్చి భూమి యంతయు రాజునకు చెందునట్లు కావించెను. ఇక ప్రజలు జమిందారులకు వశ్యులై యుండు నవసరము తొలగెను. రాజు తన భూమిని రైతులకు పంచియిచ్చి వారు తమపంటలో అయిదవభాగమును పన్నుగ నొసంగుచుండవలె నని నిర్ణయించెను. ఈ విధముగ జోసెఫ్ భూమిని రైతుపరము కావించి ప్రజాసామాన్యమునకు గొప్ప సేవచేసెను. జోసెఫ్ తెల్పిన ప్రకారము ఈజిప్తుదేశమున గొప్ప సప్తవర్షక్షామము సంభవింపగా నాతడు తెల్పిన ప్రకారమే కరవుదినములలో ధాన్యము పంచి ఈయబడినట్లు కొన్ని ప్రాచీనశాసనములు తెల్పుచున్నవి. ఈజిప్తురాజ్యమున పై కరవు సంభవించినప్పుడు పాలస్తీనములో కూడ కాటక మేర్పడెను. జోసెఫ్ సోదరులు ప్రాణరక్షణమునకై ఈజిప్తు దేశమునకు వలసవచ్చిరి. వారికి తమ సోదరుడే మహామంత్రిగ

నున్న విషయము తెలియదు. జోసెఫ్ వారు తన యెడ ప్రదర్శించిన క్రూరత్వమును విస్మరించి, వారిని మన్నించి, వారికొరకును ఈజిప్టుదేశమున గోషేన్ అను సారవంతమైన మండలమందు స్థిరనివాస మేర్పరచెను. జోసెఫ్ తండ్రియును వృద్ధుడునైన జేకబ్ సకుటుంబముగ ఈజిప్టునకు వలసపోయెను. ఈమార్పు క్రీస్తునకు పదునేడు శతాబ్దులకు పూర్వము సంభవించెను.

## యూదులకు కష్టకాలము

ఈజిప్టుదేశమునకు వలస పోయిన తరువాత నాల్గు శతాబ్దుల కాలము యూదులచ్చట శాంతముగ జీవించిరి. క్రీస్తు పూర్వము పదునారవ శతాబ్ది ప్రారంభమున ఈజిప్టు దేశమును పాలించుచున్న విదేశీయ రాజవంశ మంతరించి మరియొక రాజవంశము రాజ్యాధికారమును వహించెను. ఈ నూతనవంశము ఈజిప్టు రాజ్యమును పాలించిన రాజ కుటుంబములలో పదునెనిమిదవది. వీరు పరదేశీయులను మిక్కిలి దయతో సంరక్షించిరి. ఈ వంశములోని మూడవ ఆమెన్‌హోటప్ అను రాజు సిరియాదేశపు రాకుమార్తె నుద్వాహము కావించుకొనెను. ఈతడు నూతనముగ సూర్య దేవతారాధనను తన దేశమున ప్రారంభించినందున, స్థానికలగు మతాధికారులు రాజును ప్రతిఘటించిరి. ఈ సందర్భమున ఆమెన్‌హోటప్ రాజు విదేశీయులను తన నూతన మతసంస్థల

యందు నియమించెను. పై రాజుల యుగమందు యూదు లెట్టి కష్టములను ఎరుగక సుఖముగ జీవించిరి. కాని క్రీస్తు పూర్వము పదునాల్గవ శతాబ్దమున పదునెనిమిదవ రాజ వంశము మారి పందొమ్మిదవ వంశము పరిపాలనము చేయుట ప్రారంభించెను. ఈ రాజులు స్థానికులు. వీరికి పరదేశీయుల యెడ యెట్టి సానుభూతియును లేకుండుటయే కాక తీవ్రమగు వైరభావము కూడ నుండెను. విదేశీయు లెల్లరును అధికార పదవులనుండి తొలగింప బడిరి. ఈ కాలమున ఈజిప్టు దేశ మందు నివసించుచున్న విదేశీయులలో యూదులే ప్రముఖులు. వీరందరు నొకే మండలమందు కలసి మెలసి యుండెడివారు. ఆసియాఖండమునుండి పరరాజు లెవ్వరైన ఈజిప్టు దేశముపై దండెత్తి వచ్చుట సంభవించిన యెడల వారికి యూదులు సులభముగా సహాయపడవచ్చును. ఇట్టి ప్రమాద మెన్నడైన సంభవించుట కవకాశము కలదని భయపడి ఈజిప్టు రాజవంశ మువారు యూదులపై కఠిన చర్యలను తీసికొన నారంభించిరి. యూదులవద్దనున్న పశుసంపద నంతను ప్రభుత్వము వశప రచుకొనెను. ఆ జాతివారెల్లరును బానిసలుగ పరిగణింప బడ సాగిరి. ప్రభుత్వము వీరిచే వ్యవసాయపు పనులను, భవన నిర్మాణము మున్నగు కఠినమైన పనులను చేయింపసాగెను. ఆజ్ఞలను సక్రమముగ నెరవేర్పనివారికి కొరడాదెబ్బలు మున్నగు కూరదండనములు విధింపబడెను. ఈజిప్టురాజుల పగ యింతటితో నాగలేదు. యూదుజాతిని సంపూర్ణముగ నాశ

నముచేయవలయునని వారు పంతము పట్టిరి. ఈ జాతియందు జన్మించిన మగబిడ్డల నందరను చంపివేయవలెనని "ఫారో" రాజులాజ్ఞ యొసంగిరి. ఈ క్రూరశాసన మెన్నడును సంపూర్ణముగ అమలుకావింపబడ నందున యూదులు నశింపకుండ నిలువగల్గిరి.

# ప్రవక్తయగు మోజెస్

యూదుజాతి యీ విధముగ మహత్తర కష్టములకు లోనైయున్న కాలమున దయామయుడగు పరమేశ్వరుని యనుగ్రహమున నీజాతి యందొక మహాపురుషుడు జన్మించెను. ఈ కాలమున రెండవ రామ్సెస్ అనురాజు ఈజిప్టుదేశమును పాలించుచుండెను. ఈరాజు మిక్కిలి ప్రసిద్ధుడు. ఈతడు నూరు సంవత్సరముల కాలము జీవించి, అరువదియేడు వత్సరములు మహావైభవముతో రాజ్యపాలనము కావించెను. ఈరాజు సైతము యూదుజాతిలో జన్మించిన మగశిశువుల నందరను సంహరింపవలసిన దను కఠోరనియమము నవలంబించి, తదనుగుణముగ ఆజ్ఞలను పంపెను. ఇట్టి అననుకూలకాలమున క్రీస్తునకు పూర్వము 1270వ సంవత్సరప్రాంతమున ప్రవక్తయగు మోజెస్ యూదుజాతి యందు జన్మించెను. ఫారోరాజు క్రూరశాసనము నెరింగియున్న ఆతని తల్లి, ఆ పసిబిడ్డను నొక తొట్టెలో పరుండబెట్టి, ఆ తొట్టెను నైలు నదీతీరమున

రెల్లుగడ్డిలో దాచి అచ్చట తన కుమార్తెను కాపుదలగ నిల్పెను. కొంతసేపటి కా ప్రదేశమునకే ఈజిప్టు రాకుమారి స్నానమునకై యేతెంచెను. తొట్టెలో నేడ్చుచున్న పసిబిడ్డను చూచునరి కామె మనస్సు కరగి ఆ పిల్లవాని నామె తనతో రాజ భవనమునకు గొనిపోయి పెంచసాగెను. నీటియందు దొరికిన బిడ్డకావున రాకుమారి యాతనికి "మోజెస్" అను నామకరణము కావించెను. ఈ బాలుడు రాజభవనము నందే పెరిగి ఆ కాలమున నీజిప్టు దేశమున వ్యాప్తియందున్న సమస్త విద్యలను నేర్చెను. రాజభోగముల ననుభవించుచున్నను మోజెస్‌కు మనశ్శాంతి లేకుండెను. తన జాతివారగు యూదులు పడుచున్న పాట్లను చూచునప్పు డాతని హృదయము నీరయ్యెడిది. ఒకనా డొక ఈజిప్టు దేశపు టుద్యోగి యూదు నొక్కనిని క్రూరముగ కొరడాదెబ్బలు కొట్టుట మోజెస్ కంట బడెను. ఆ దృశ్యమును చూచి మిక్కిలి ఆగ్రహావేశ పరవశుడై మోజెస్ ఆ ఉద్యోగిని సంహరించెను. ఆవేశముచే కావించిన యీ సాహసపు పనికై ఆతడు మిక్కిలి చింతింప సాగెను. ఈ విషయ మెవ్వరికైన తెలిసిన పక్షమున తన ప్రాణమునకు మోసము వచ్చుట నిశ్చయ మని తెలిసి కొని మోజెస్ ఈజిప్టు దేశమును వీడి పారిపోయెను. అరే బియా గుడమునకు సమీపమందలి మీడియన్ మండలమున నాతడు కొన్ని సంవత్సరములు గడపెను. ఆ కాలమునం దాతడు మీడియన్ మండలపు రాజగు జెత్రో కుమార్తె

నుద్వాహమాడి, పచ్చని గడ్డిమైదానములలో గొఱ్ఱెలను మేపుచు, సెలయేళ్ళయొడ్డున విశ్రమించుచు, ప్రశాంతమగు జీవితమును గడపెను. ఆర్థికముగ కూడ మోజెస్ బలపడెను. కాని ఆతనికి మనశ్శాంతి లేకుండెను. విదేశమున తన జాతి వా రనుభవించుచున్న కష్టము లెల్లప్పుడు నాతనికి కండ్లకు కట్టినట్లు తోప సాగెను. యూదు జాతికి మోక్షము ప్రసాదింపు మని యాతడెల్లప్పుడును పరమేశ్వరుని ప్రార్థించెడి వాడు. ఆ కాలమునం దీజిప్టు దేశమువారు పశు పక్ష్యాది రూపముల ధరించిన యనేక దేవతలను కొల్చు చుండిరి. కాని యూదులు మాత్రము భగవంతు డొక్కడే యని నమ్మి, ఆతడే తమ్ము కష్టములనుండి గట్టెక్కింప గలడని విశ్వసించి యుండిరి.

## మోజెస్ యూదులకు విముక్తి కల్గించుట

ఒకనాడు మోజెస్ నిర్జనమైన అరణ్యమధ్యమున నొక పర్వతముపై తీవ్రముగ నాలోచించుచున్న సమయమున భగవంతు డాతనికి దర్శన మొసంగి, ఆతడును, ఆతని సోదరుడగు ఆరన్‌ను నిర్భయముగ ఈజిప్టు దేశమునకు మరలిపోయి యూదుల నందరను బానిసతనమునుండి విడుదల కావింప వలసినదిగా కోరవలయునని ఆజ్ఞాపించెను. ఇట్లు చేయుట సాహసమును, ప్రమాదభూయిష్ఠము నగు కార్యము. అయి

నను జంకక మోజెస్ సోదరుడగు ఆరన్‌ను వెంటబెట్టుకొని ఈజిప్టు రాజ్యమునకేగి తన జాతివారి నందరను విడుదలచేయు వలెనని ఫారోను కోరెను. అప్పటికి రెండవ రామ్సేస్ రాజు మరణించెను. కాని యూదుల కష్టములుమాత్ర మే విధముగను తగ్గలేదు. ఎప్పటి వలెనే వారు బానిసలవలె కష్టించుచు పట్టణములు దేవాలయములు నిర్మించుచు, కాలువలు త్రవ్వుచు, బరువులను మోయుచు బాధపడుచుండిరి. యూదు బానిసల యునికివలన ఈజిప్టు దేశమున కెంతయో లాభము కల్గుచుండెను. కావున ఫారో రాజు మోజెస్ కోర్కెను మన్నించుటకు మారు నిరాకరించెను. అంతే కాదు. యూదుల పై కావింపబడుచున్న నిర్బంధముల నింకను కఠినతరము కావించెను. యూదులలో ననేకులు ఇటుకలు చేయుటకై నియోగింపబడిరి. మట్టిలో కలుపుటకును, ఆవముపంపు నిప్పు దరికొల్పుటకును కావలసిన గడ్డినంతకు పూర్వము కుమ్మరులు సంపాదించి యిచ్చుచుండిరి. యూదు స్వాతంత్ర్యమునకై మోజెస్ కావించిన విజ్ఞాపనము విని మీదట ఫారో రాజు వారియందలసత హెచ్చినదని తలంచి, ఇటుకలు చేయుటకై కావలసిన గడ్డినంతను యూదులే స్వయముగ కోసి తేవలెనని యాజ్ఞాపించెను. కాని మోజెస్‌ను, అతని సోదరుడును అధైర్యము చెందక తాము కోరిన కోర్కె భగవత్ప్రీతికరమైనదనియు. ఆవిషయమును ఋజువు పరచుటకై తామెట్టి యద్భుతములనైన కావింపగలమనియు, అనేక పర్యాయములు

ఈజిప్తురాజునకు తెల్పిరి. కాని వారు చూపిన యమానుష శక్తుల నన్నిటిని, స్థానికులగు ఈజిప్టు మతాధికారు లనుకరింప జొచ్చిరి. కావున కొన్ని దినములవరకును ఫారోరాజు మోజెస్ తెల్పిన యంశములను నమ్మలేదు. మరికొంత కాలమున కీజిప్తు దేశము తీవ్రములగు రోగములకు గురియై జనులు మిక్కిలి బాధపడజొచ్చిరి. అంతట రాజు భయపడి మోజెస్‌తో సంధి చేసికొనుటకై యంగీకారము చూపసాగెను. మొదట ఫారో రాజు యూదులకు తన రాష్ట్రమున వారి మతానుగుణ్యముగ ప్రార్థనాదికముల సల్పుట కనుమతి నొసంగెదనని పల్కెను. తన దేశమును వీడి చాలదూరము పోమని వాగ్దానము చేసిన పక్షమున వారిని విడుదల కావించుట కొప్పుదల చూపెను. మరికొంత కాలమునకు యూదులు తమ పశుసంపద నెల్ల ఈజిప్తుదేశమున విడచిపోయిన పక్షమున వారు వలసపోవుటకు తా నెట్టి యభ్యంతరమును కల్పింపనని అభయమిచ్చెను. కాని ఇట్టి నిర్బంధములను అంగీకరించుటకు మోజెస్ నిరాకరించెను.

పరమేశ్వరు డొక నాడు మోజెస్‌కు దర్శన మొసంగి తా నీజిప్తుదేశముపై ఒక మహామారిని పంపబోవుచున్నా ననియు, దాని వలన అచ్చటి ప్రజలందు భీతాహము ప్రబలి తమంత తామే వారు యూదుల నీజిప్తు నుండి పంపివేయుదు రనియు తెల్పెను. ఈ ఘోర ప్రమాదసమయమున ఈజిప్టు దేశమందలి ప్రజలందరును—రాజు మొదలుకొని బానిస వరకును

తమ ప్రథమసంతానమును కోల్పోవుదురు. జంతువులకు కూడ నీ దుస్థితియే సంభవించును. దీనివలన దేశమం దంతటను మున్నెన్నడును కనివిని యెరుంగని విధముగ దుఃఖమును, మన క్షోభమును కల్గును. ప్రజల హాహాకారములు మిన్నుముట్టును. ఈ విధముగ భగవంతుడొసంగిన శాపమును మోజెస్ రాజుకు వినిపించెను. ఆనాడు రాత్రి యూదులెల్లరును నడుములు బిగించి, ఆయుధముల చేతబూని రాబోవు మహాప్రళయము నెదురుచూడ సాగిరి. అర్థరాత్రమున నీజిప్టు ప్రజకొక గొప్ప వజ్రాఘాతము కల్గెను. రాజభవనమందును, పట్టణములలోను, పల్లెలయందును జనులు తమప్రథమ సంతానమును గోల్పోయిరి. తన దేశమునకు సంభవించిన యీమహాపదకు వెరగందిఫారోరాజు మోజెస్ ఆరన్‌ల పిలిపించి, తనపై దయదలచి తన దేశమును వీడి పోవలసినదని ప్రార్థించెను.

చిరకాలమునుండి మోజెస్ ఏ శుభముహూర్తమునకై ఎదురు చూచుచుండెనో అది యేతెంచెను. మోజెస్ ఆరన్‌లు తమ నాయకత్వమున ఈజిప్టునందు నివసించుచున్న యూదుల నందరను సమావేశపరచిరి. వారికి సంబంధించిన పశుసంపద యంతయును ఈ నిష్క్రమణమునకై సిద్ధపరుపబడెను. ప్రాచీన యుగమందింతటిగొప్పవలస మరే దేశమునను సంభవించినట్లు తెల్పుటకు వలనుపడదు. ఈ సందర్భమున నీజిప్టుదేశమును వదలిపోయినవారు 6,00,000 మనుష్యులని బైబిలు గ్రంథము పేర్కొనుచున్నది. పై ఆరులక్షల ప్రజలును వయస్సువచ్చిన

పెద్దలనియు, వీరుకాక అనేకులు పసిబిడ్డలుకూడ ఈ వలస యందు చేరియుండుట సహజ మనియు, కావున వలసపోయిన వారి మొత్తము ఇరువది లక్షల జనులవరకు నుండవచ్చునని యు కొందరు వ్యాఖ్యానకారు లభిప్రాయపడుచున్నారు. కాని రాక పోకల సౌకర్యము లెంతమాత్రమును లేని యీ ప్రాచీనకాల మున నిరువది లక్షల ప్రజ యొకదేశమునుండి వేరొక దేశము నకు పోగల్గుట అసాధ్య విషయము. కావున బైబిలు గ్రంథ మున పేర్కొనబడిన ఆరు లక్షల సంఖ్య, వలస పోయిన మొత్తము యూదులసంఖ్య యని మనము నిశ్చయింపవచ్చును. యూదు లీజిప్టుదేశమునుండి తరలి వచ్చిన కాలము కూడ సంశయాస్పదమై యున్నది. కాని ఇటీవల జరుపబడిన పరి శోధనలవలన పై వలస క్రీస్తునకు పండ్రెండు శతాబ్దులకు పూర్వము సంభవించి యుండునని యూహింపబడుచున్నది. అప్పటికి సుప్రసిద్ధుడగు రెండవ రామ్సెస్ రాజుమరణించెను. మెరెంప్టా యను రాజు రాజ్యము చేయుచున్నప్పుడీ మహత్తర సంఘటన సంభవించి యుండును.

మోజెస్ యూదుల నందరను సురక్షితముగ సూయజు గుడము (Gulf of Suez) వరకును నడపించెను. కాని వారింకను ఈజిప్టు ప్రభువుల రాజ్యపు పొలిమేరయందే యుండిరి. మహామారి వలన కల్గిన భయోద్రేకముచే ఫారో రాజు యూదులను దాసత్వమునుండి విడిపించెను. కాని కొన్ని దినములు గడచుసరికి ఆతనికి చిత్తస్వాస్థ్యముకల్గి, తాను

కావించిన పనివలన ఈజిప్టుదేశమున కార్థికముగ గొప్పనష్టము సంభవించుననియు, ఇకముందు తమకు సమస్తులైన బానిసలు లభింపరనియు ఆతనికి తెలియవచ్చెను. కావున ఈజిప్టురాజ్యమును విడచి వెడలి పోవుచున్న యూదులను నిర్బంధించి వెనుకకు రప్పింపవలయునని ఆతడు నిశ్చయించెను. అప్పటికింకను యూదు లీజిప్టు రాజ్యపు సరిహద్దులందే యుండిరి. కావున మెరెంప్టారాజు యూదులను మరలించి తీసికొని వచ్చుటకై వాయువేగమున ప్రయాణము చేయగల రౌతులను, రథికసేనను పంపెను. వా రతిశీఘ్రముగ యూదుల స్థావరమును చేరగల్గిరి. నూతనముగ సంభవించిన ఈ యాపదను చూచి యూదులెల్లరును మోజెస్‌ను నిందింపసాగిరి. కాని భగవత్కృపవలన వీరి కాత్మ రక్షణమునకై ఒక అపూర్వ మార్గము కానవచ్చెను. రాత్రి సమయమున తూర్పుదిశనుండి ప్రబలమైన గాలి వీచుట ప్రారంభించెను. యూదులు విడిసియున్న ప్రదేశమున సముద్రము చాల మెరకగ నున్నందున గాలి వేగమున నీరంతయు ప్రక్కలకు తొలగిపోయెను. భగవంతుడు తన కన్ని వేళల నండగ నిలువగలడని అచంచలవిశ్వాసము గల మోజెస్ తక్షణమే యూదుల నందరను ముందునకు నడపించి క్షేమముగ సముద్రశాఖ కావలియొడ్డును చేరెను. మరికొంత సమయముగడచిన తరువాత ఈజిప్టుసేనలు యూదులను తరుముచు వచ్చి ఈ సముద్రపుపాయలో ప్రవేశించెను. వారి రథములును, గుఱ్ఱములును తడియిసుకలో వేగముగ నడువ

జాలవయ్యెను. ఇంతలో తూర్పుగాలి చట్టుసడెను. సముద్ర జలమంతయు వేగముగ యథాస్థానమునకు ప్రవహించి వచ్చుటయు, హతభాగ్యులైన ఈజిప్టుసైనికు లందరును ఆ జలరాశి మునిగి ప్రాణముల గోల్పోయిరి. మోజెస్‌నకీ సంఘటన యూదులను రక్షించుటకై కావింపబడిన భగవల్లీలగ కాన్పించినను, ఇయ్యది ప్రకృతిసిద్ధమగు సముద్రపు పాటు పోటు లని నేడు మన మెఱుంగుదుము. ఆర్టాజెర్జెస్ అను పారసీకపు చక్రవర్తి ఈజిప్టుదేశముపై దండెత్తిన సందర్భమున నాతని సేనకిదేవిధమగు సర్వనాశనము సంభవించినట్లు చరిత్రములు తెల్పుచున్నవి. పై ప్రమాదమునుండి తప్పించుకొనిన వెనుక మోజెస్ తన జాతివారిని అకాబా గుడమువైపు తూర్పుగ నడపించి ఈజిప్టురాజ్యమునుండి బయలుపడెను. ఈ ప్రాంతమున ఆబ్రహామ్ వంశమునకు చెందిన ఇడోమైట్స్ (Edomites) అను తెగవారును, మోజెస్ యొక్క మామ పరిపాలన యందున్న మిడియానైట్స్ (Midianites) అను తెగవారును నివసించియుండిరి. వీరు కాందిశీకులగు యూదులకు తప్పక సహాయము చేయుదురని మోజెస్ తలంచెను. కాని అకాబా ప్రాంతమునుండి ఉత్తరముగ ప్రయాణము చేయుచున్న సందర్భమున కొందరు శత్రువులు యూదుల నెదిరించిరి. జాషువా అను వాని నాయకత్వమున వారు తమ శత్రువుల జయించి, ముందునకు సాగిపోయి, సినాయ్ అను పర్వత ప్రాంతమున స్థిరనివాసము కల్పించుకొని కొంతకాల మచ్చటనే గడపిరి.

# యూదుల సామాజిక ఆర్థిక వ్యవస్థ

నూతనముగ నేర్పడిన యీ జాతికి మార్గదర్శకముగ నుండుటకై యూదు నాయకుడగు మోజెస్ చక్కని వ్యవస్థను కావించెను. ఈ యంశము నం దాతనికి, ఆతని మామ యగు జెథ్రో నుంచి ఉపదేశము కావించెను. మోజెస్ కావించిన బోధనలయం దేకేశ్వరోపాసనము మిక్కిలి ముఖ్యమైనది. యెహోవాయే సర్వేశ్వరుడు. ఆతడే యూదులకు నాయకుడు, శాసనకర్త, న్యాయప్రదాత. కావున యూదు లెల్లరును ఆతనినే నమ్మి గౌరవింప వలయును. పూజింప వలయును. ఇతర దేవతలను పూజించుట గర్హ్యము. విగ్రహారాధనము సంపూర్ణముగ నిషేధింప బడెను. ఇందులకు విరుద్ధముగ వర్తించువారికి కఠినదండనములు విధింపబడెను. రాజ్యాంగ విషయములలో మోజెస్ ప్రజాస్వామిక ప్రభుత్వము నేర్పాటు కావించెను. ప్రాచీన యూదుల రాజ్యాంగము నేటి అమెరికా సంయుక్త రాష్ట్రపు రాజ్యాంగ విధానముతో పోల్పదగి యున్నది. కొన్ని ముఖ్య విషయములలో యూదు తెగలవా రందరును సమిష్టి పరిపాలనా పద్ధతి నేర్పాటు కావించుకొనిరి. ఈ ఏర్పాట్లను మార్చుటకు వలను పడదు. కాని స్థానికవిషయములం దే తెగవారు వారి కిష్టమైన విధముగ పరిపాలనము సాగించుకొనవచ్చును. యుద్ధము సంభవించి నప్పుడు మాత్రము యూదు తెగలవా రందరు నేకమై

ఒకే నాయకుని యాజమాన్యమున శత్రువులతో పోరాడు చుండిరి. మోజెస్ కావించిన ఆర్థిక వ్యవస్థ మిక్కిలి ఉత్తమ మైనదని నిస్సంశయముగ తెలుపవచ్చును. యూదు లందరు నొకే జాతికి చెందినవారు. సోదర ప్రాయులు. కావున ఎవ్వ డును కూడ తనతోటి యూదుని బాధింపరాదు. సంఘము నందు నిరుపేదలగు వా రెవ్వరును ఉండరాదు. భూమి నంతను ప్రజలకు న్యాయ సమ్మతముగ పంచి ఈయ వల యును. ప్రతి కుటుంబమునకును కొంత భూమి యొసంగ బడెను. కష్టకాలము వచ్చినప్పుడు గృహ యజమాని తన భూమిని, తన బిడ్డలను, తన్నును కూడ తాకట్టు పెట్టుకొని జీవనోపాధిని సంగ్రహింప వచ్చును. కాని కొన్ని నిర్ణీత సమ యములందు యూదు జాతి వారి కెల్లరకును కొన్ని పర్వ ములు వచ్చుచుండెడివి. ఆ పర్వకాలమున పరులకు స్వాధీన పడిన భూములును, మానవులును కూడ, ఆ అస్వాతంత్ర్యము. నుండి విడివడు చుండిరి. ఆ కాలమున యూదు రాజ్యమున ననేకములగు తీవ్రవ్యాధులు ప్రబలుచుండెను. అట్టి వ్యాధులు తమ్ము చేరకుండుటకై పారిశుధ్యవిషయమున మిక్కిలి కఠిన ములగు నిబంధనములు కావింప బడెను. యూదులు చిర కాలము ఈజిప్టు దేశమున బానిసలుగ నుండిన కారణమున వారి యందలి నైతికవర్తనము మిక్కిలి హీనదశయం దుండెను. ఆ పారతంత్ర్యయుగమున వీరికి న్యాయము లభిం చెడిది కాదు. కావున ఒక యూదుని వేరొకడు హింసించిన

పక్షమున హింసితుని బంధుమిత్రులు దౌర్జన్యము కావించిన వానిపై రహస్యముగ కాని, బహిరంగముగ కాని, పునః దౌర్జన్యము కావించుచుండిరి. ఇదియే ఆనాడు వారికి తెలిసిన న్యాయవిధానము. ఇట్టి పరస్పర దౌర్జన్యము సక్రమమైనది కాదని గుర్తించి, నేరస్థులను దండించుటకై మోజెస్ కఠినమగు నొక శిక్షాస్మృతి నేర్పాటు కావించెను. నేరములు కావించు వారిని ప్రభుత్వము వారే దండించు నట్లును, బాధితుని బంధుమిత్రాదులు ప్రతి దౌర్జన్యమునకు పూనకుండు నట్లును అతడు కట్టడి కావించెను.

నిరుపేదల యందును నోరులేని జంతువుల యెడలను మోజెస్ స్మృతికారుడు చూపిన దయ మిక్కిలి అపారమైనది. పొలములలోని సస్యమును కోయు నప్పుడు మూలలలో నున్న పైరును విడచివేయవలయును. పంట కళ్ళములో ధాన్యము నింటికి చేర్చునప్పుడు భూమి నంతను ఊడ్చుకొనిపోరాదు. ద్రాక్షతోటలలో నేలపై రాలిన పండ్లను ఏరుకొని తెచ్చుట శ్రేష్ఠమైన పనికాదు. ఆపాటి ధాన్యమును, ఫలములను, నిరుపేదల కొరకును, పథికుల కొరకును విడచిపుచ్చవలెనని మోజెస్ ఆదేశించెను. పశువులచే కళ్ళము త్రొక్కించునప్పుడు వాని మూతులకు చిక్కములు తగిలింపరాదు. వానికి కడుపునిండ మేయుట కవకాశ మీయవలయును. కాడికి పశువులను పూన్చు నప్పుడు సమాన బలముగల జంతువులను మాత్రమే పూన్చ వలయును. పక్షులను వేటాడు నప్పుడు

వయసు పక్షులను మాత్రము చెరపట్టి వయసు మీరిన వానిని కనికరముతో విడచిపుచ్చుట ధర్మము. ఇదే విధముగ సోదర మానవుల యెడల కనికరము తోడను, ధర్మ బుద్ధితోడను వర్తింప వలయునని మోజెస్ మరల మరల శాసించెను.

దైవశాసనముల గ్రహించుటకై మోజెస్ పర్వతములపై నేకాంతముగ తరచు నివసించుచుండెడివాడు. ఒక పర్యాయ మాతడెల్లు సుదూరమును ప్రశాంతమునగు ప్రదేశమున కేగి ధ్యాననిమగ్నుడై చాలదినములవరకును మరలి రాలేదు. అది చూచి యూదులు పలువురు మోజెస్ మరణించెనని నిశ్చయించి విశృంఖలులై వర్తించుచు, ఈజిప్టు దేశమునందు తా మవలంబించిన విగ్రహారాధనాదికములగు ఆచారముల నవలంబించి యథేచ్ఛగ మెలగసాగిరి. మోజెస్ సోదరుడగు ఆరన్ వీరి సదుపాజ్ఞలలో పెట్టజాలడయ్యెను. కావున యూదులను సంతోషపెట్టుటకై ఆతడు స్వర్ణవిగ్రహ పూజనము దూష్యము కాదని ప్రకటించెను. ఇంతలో తపస్సును ముగించుకొని మోజెస్ తిరిగి వచ్చెను. తనజాతివారి పతనమును, వారియందు ప్రబలిన దురాచారములను చూచి మోజెస్ మిక్కిలి ఉగ్రుడై పరమేశ్వరుని యెడల నిజమైన భక్తితాత్పర్యములు కలవారెల్లరును తన పక్షము నవలంబింపవలయునని కఠినముగ శాసించెను. మోజెస్‌కు సన్నిహితులగు లెవీ తెగవా రాతని నాయకత్వము నంగీకరించిరి. అంత నాతడు విగ్రహారాధకులగు వారి నందరను సంహరింప

వలసినదని యాజ్ఞ యొసంగగా, లెవీ తెగవారీ యాజ్ఞలను సక్రమముగ నిర్వర్తించిరి. వీరు తనకు కావించిన సహాయము మనమునం దిడుకొని దేవస్థానములం దుద్యోగులుగ లెవీతెగవారిని మాత్రమే మోజెస్ నియమించెను.

దేవస్థానమునం దుద్యోగులుగ నియమింపబడిన లెవీ తెగవారితరధర్మముల ననేకముల నిర్వర్తించుచుండిరి. ఆ కాలమున యూదులకు వ్యవసాయమే ముఖ్యవృత్తి. వారికితమవృత్తిని సక్రమముగనడపుటయందేకాలమంతయు గడచిపోవును. కావున సంఘసేవకు సంబంధించిన యితర కార్యకలాపముల నిర్వర్తించుటకై యొక ప్రత్యేకశాఖ యుండుట మిక్కిలిఆవశ్యకమనిగుర్తించి ఈ కార్యభారమును మోజెస్ లెవీ తెగవారిపై నిడెను. వీరు పూజారులుగను, న్యాయాధిపతులుగను, గ్రాయసగాండ్రుగను వ్యవహరించెడివారు. రాష్ట్రమునందలి గొప్ప యుద్యోగములు మొదలుకొని హీనకార్యములవరకు అన్నిటిని కూడ లెవీ తెగవారే నిర్వర్తించుచుండిరి. పురోహితుల కెల్ల పెద్దయు, వ్యాపారపర్యవేక్షకుడును, వైద్యుడును, పాకీపని చేయువాడును కూడ లెవీ తెగకే చెందియుండెడివారు. వారు నిర్వర్తించు ధర్మముల కనుగుణ్యముగు వేతనము వారి కొసంగబడుచుండెను. రాజ్యమును విభజించునప్పు డొక్కొక్క తెగవారొక ప్రాంతమున నివసింపవలయునని శాసింపబడెను. అదే విధమున లెవీ తెగవారి నివాసమునకై కొన్ని పట్టణములు ప్రత్యేకింపబడెను. వీరికి భూవసతులు కల్పింపబడలేదు. కాని

భూమిపంటయందు కొంతభాగమును, ఇతర విధములగు పన్నులును వారికి చెందునట్లు శాసింపబడెను. ఈ విధముగ వారికి మంచిఆదాయము లభించుచుండెను. కాని దైవపూజాదికములకై చాల ధనము వ్యయపడుచుండినందున వారి అనుభవమునకై చాలతక్కువ మొత్తము మిగులుచుండెడిది. కాని లేవీ తెగవారికి గ్రాసవాసములకు మాత్ర మెట్టిలోటును లేకుండ గడచిపోవుచుండెను.

## కానాన్ రాష్ట్రమును జయించుయత్నము

ఈ విధముగ తనజాతియందు చక్కని సాంఘికవ్యవస్థ నేర్పాటు కావించి ఆపైన స్వరాష్ట్రమగు కానాన్‌ను జయింపవలయునని మోజెస్ నిశ్చయించెను. కావున ఆ ప్రాంతమునకు సరిహద్దున నున్న కాడిష్ బార్నియా అను పట్టణము వరకును యూదులు సాగిపోయి కానాన్ రాష్ట్రపు స్థితిగతులను తెలిసికొనివచ్చుటకై పండ్రెండుగురు చారులను పంపిరి. ఈ చారులందరును కూడ కానాన్ రాష్ట్రము సారవంతమును, సర్వసంపత్సమృద్ధమునై యున్నట్లు తెల్పిరి. కాని అచ్చట నివసించుచున్న ప్రజలు మిక్కిలి బలవంతులనియు, ఆ కారణమున వారిని జయించి పారద్రోలుట కష్టసాధ్యమనియు చారులలో నత్యధికసంఖ్యాకు లభిప్రాయపడిరి. కాని కేలెబ్, జాషువాలను వారు మాత్రము తక్షణమే కానాన్ రాష్ట్రముపై

దాడిసల్పి దానిని జయింపవలెనని అభిప్రాయపడిరి. కాని వీరి యుద్దేశ్యములు భీరువులగు యూదులకు రుచింపక వీరందరు నేకమై ధైర్యశాలురగు కేలెబ్ జాషువాలను చంపుటకై ప్రయత్నము చేసిరి. ఈ సమయమున యూదుల భీరుత్వమునకు బలవత్తరమగు కారణము లుండెను. వారు చిరకాలము ఈజిప్టుదేశమున పరాధీనులై బానిసలవలె కాలము పుచ్చియుండిరి. బానిసలయందు ధైర్య స్థైర్యములు కొరవడి యుండుట సహజము. ఆనాటికి వారి యందు మతావేశము కూడ లేకుండెను. ఇట్టి ప్రజలు సాహసకార్యముల గావించి పరరాష్ట్రముల జయించుట సాధ్యముకాని పని యని నిశ్చయించి, ఆ తరము గడచి సాహసవంతులును ధైర్యశాలురు నగు మరియొక తరమువా రవతరించువరకును కానాన్ రాష్ట్ర విజయమాపుదల చేసినట్లు మోజెస్ ప్రకటించెను. మోజెస్ కావించిన నిర్ణయము వలన పలువురకు తీరని ఆశాభంగము కల్గెను. యూదులలో కొందరు తమ నాయకుడు కావించిన నిషేధమును సరకు గొనక కానాన్ రాష్ట్రమున చొరబడి దానిని జయించుటకై యత్నించిరి. కాని ఆ ప్రయత్నము విఫలమై పలువురు తమ ప్రాణముల గోల్పోయిరి. ఈ విధముగ పరాజయము పొందిన తరువాత కొన్ని సంవత్సరముల పాటు యూదులు స్వరాష్ట్రమును ప్రవేశింపక దాని సరిహద్దులందే తమ గొఱ్ఱెల మందలను మేపుకొనుచు శాంతముగ కాలము గడపిరి. ఈ విధముగ నెంత కాలము గడచెనో తెల్పుట సాధ్య

ముకాదు. బైబిలు గ్రంథము నలుబది గ్రీష్మములు గడచినట్లు తెల్పుచున్నది. కాని బైబిలు గ్రంథములోని సంఖ్యలను చక్కగ నిర్ణయించి తెల్పుట కష్టసాధ్యము. ఈజిప్టుదేశము నందు నివసించి అచ్చటి కష్టనిష్ఠురములచే జవసత్వములను, ధైర్యోత్సాహములను కోల్పోయిన యూదుల తరము గడచి పోయెను. ఒక నూతన తరమువారు వారిస్థానము నాక్రమించిరి. వీరు పారతంత్ర్యమనున దెట్లుండునో యెరుంగక స్వేచ్ఛగ బ్రతికినవారు. వారి జీవితమంతయు విశాలమగు పచ్చిక బయళ్ళయందును, పర్వతమయప్రదేశములందును జీవించి, అసాధారణమగు దేహదార్ఢ్యమును సంపాదించి సాహస ధైర్యములు మూర్తీభవించినట్లు చూపట్టసాగిరి. ఇప్పటికి ఆరన్‌ను, ఆతని సహచరుడగు మిరియమ్ అను నాతడును మరణించిరి. మోజెస్‌కు వార్ధక్యము సంభవించెను. కావున మోజెస్ అనుమతిపై జాషువా అను నాతడు యూదులకు నాయకత్వము వహించెను. ఈతడు తన జాతివారిని నడపించుచు పోయి కానాన్ రాష్ట్రమును ప్రవేశించెను. అచ్చట వీరు తమ ప్రతిపక్షుల నవలీలగ నోడించి జోర్డాన్ నది తూర్పు భాగమున విడిసిరి. శత్రువులు వీరిని పరాభవించుటకై అనేక మాయోపాయములను అవలంబించిరి. కాని దానివలన యూదుల కెట్టి నష్టమును సంభవింపలేదు. జోర్డాన్ నదికి తూర్పున నున్న దేశమును జయించి మోజెస్ అనుమతిపై కొందరు యూదులు అచ్చట స్థిరనివాస మేర్పరుచుకొనిరి.

పాలస్తీన మందలి మిగిలిన ప్రాంతమునుకూడ జయింప వలె నని మోజెస్ వారికి సందేశ మొసంగెను.

ప్రవక్తయగు మోజెస్‌న కవసానకాల మాసన్న మయ్యెను. తన జీవిత కాలమం దాత డనేక మహాత్కార్య ముల సాధించెను. పరాధీనులై యున్న యూదుల కాతడు స్వాతంత్ర మొసంగెను. ఆ జాతి కాత డొక సర్వసంపూర్ణ మగు శిక్షాస్మృతిని, శాసనములను, సాంఘిక వ్యవస్థను ప్రసాదించెను. స్వరాష్ట్రమగు పాలస్తీనమును మరల జయిం చుటకై వారియందు ధైర్యోత్సాహములు పురికొల్పెను. రాష్ట్ర సంపాదనమునకై ప్రాతిపదికగ కొన్ని విజయములను కూడ ఆతడు సాధించెను. ఇంతటి మహత్తరమగు సేవను కావించి, తన యనంతరము జాషువా అను నాతనిని యూదు లకు నాయకునిగ నియమించి, పరమేశ్వరు నెల్లప్పుడును నమ్మి, ఆతని అనుగ్రహముపైననే తమ భావి యాధారపడి యుండు నను నంశమును సర్వదా జ్ఞప్తియం దుంచుకొనుడని మోజెస్ తన జాతికి సందేశ మొసంగెను. ఆ పైన నాతడొక దినమున "పిస్గా" అను పర్వతము నధిరోహించి అచ్చటినుండి యూదుల స్వరాష్ట్రమగు కానాన్‌ను కన్నులపండువగ జూచి, ఆనందించి పరమేశ్వరుని యందే చిత్తమును లగ్నము కావించి, మోజెస్ పరమపదమును చేరెను.

# కానాన్ రాష్ట్రమును వశపరచుకొనుటకై యూదుల యుద్ధములు

జాషువా నాయకత్వమున యూదు సేనలు జోర్డన్ నదికి తూర్పు తీరమున విడిసెను. ఆవలి యొడ్డున వారికెదురుగ జెరికో అను ముఖ్యమగు పట్టణము నెలకొని యుండెను. అయ్యది కానాన్ రాష్ట్రమునకు ముఖద్వారము వంటిది. కావున దానిని జయించుటకై జాషువా నిశ్చయించెను. అదృష్ట వశమున ప్రకృతి కూడ వారికి సహాయపడెను. యూదులు ఈజిప్టు రాష్ట్రమునుండి వెడలి వచ్చునప్పుడు సూయజ్ వద్ద సముద్రము తాత్కాలికముగ నింకిపోయినట్లే జోర్డన్ నదీ జలములు సైతము వాయు వేగముచే నెట్టివేయ బడి అదృశ్యమయ్యెను. ఆ యదను చూచుకొని యూదు సేనలు జోర్డన్ నదిని దాటి అతిశీఘ్రముగనే జెరికో పట్టణమును వశపరచుకొనెను. ఆ పైన వారు "ఏ" అను పట్టణమును కూడ స్వాధీనము కావించుకొనిరి. మరికొంత కాలమునకు జాషువాకును, దక్షిణ పాలస్తీనము నందలి రాజులతో యుద్ధము సంభవించెను. జెరూసలేమ్ పట్టణపు రాజు వీరికి నాయకుడు. ఈ యుద్ధము నడచునప్పుడు జాషువా తాను విజయమును సాధించు వరకును సూర్యుడు ముందునకు సాగి పోరాదని యాజ్ఞాపించె ననియు, అదే విధమున సూర్యరథము కొంత కాలము వరకును నిలచిపోయె ననియు, శత్రు వినాశ

నము పూర్తియైన వెనుక సూర్యుడు మరల పశ్చిమాభిముఖ
ముగ పోసాగె ననియు బైబిలు గ్రంథము వర్ణించుచున్నది.
ఇట్టి యద్భుతసంఘటనలు హైందవపురాణములలోకూడ విస్తార
ముగ వర్ణింపబడి యున్నవి. జాషువా సూర్యునికి గమన
నిరోధము కావింప లేదనియు, ఇను డస్తమించుటకు పూర్వమే
తనకు విజయమును ప్రసాదింపుమని యాతడు పరమేశ్వరుని
ప్రార్థింపగా, భగవాను డా మొర నాలకించి జాషువాకు విజ
యమును చేకూర్చెననియు నేటి విమర్శకు లీగాథ కన్వయము
తెల్పుచున్నారు. ఏది యెట్లయినను జాషువా నాయకత్వమున
యూదులు దక్షిణ పాలస్తీనపు రాజులను సంపూర్ణముగ
నోడించిన యంశముమాత్రము సత్యము. యూదులు సాధించు
చున్న విజయపరంపరలకు భయపడి పాలస్తీనములోని ఉత్తర
ప్రాంతీయులగు రాజులు తమ సేనలతో వారిని దాకిరి. కాని
విజయలక్ష్మి మరల యూదులనే వరించెను. ఈ విధముగ
వీరికి పాలస్తీనములో బలవత్తరమగు స్థానము లభించెను.
కాని పాలస్తీనమంతయు యూదులకు వశపడినట్లు తెల్పుటకు
వలనుపడదు. డేవిడ్ అను రాజు కాలము వరకును పాలస్తీన
ములోని అనేక పట్టణములను స్థానికులగు కానాన్ ప్రజలు
పాలించుచుండిరి. అయినను యూదు లధిక సంఖ్యాకులుగ
కానాన్ రాష్ట్రమున స్థిరనివాస మేర్పరచుకొని స్థానిక ప్రజ
లతో కలసి మెలసి జీవింపసాగిరి. జోర్డన్ నదికి తూర్పు భాగ
మున కొందరు యూదులు శాశ్వతనివాసము కల్పించుకొని

న్లు ఈ వరకే తెలుప బడినది. వారికి తమ సోదరులగు ఇతర యూదులతో సంబంధములు తెగిపోయి, వారు విగ్రహారాధనము మున్నగు దురాచారములకు లొంగి పోయిరి. కాని పాలస్తీనములోని యూదు ల్లు కాక మోజెస్ నిర్ణయించిన ధర్మమార్గము నవలంబించిరి. జాషువా ఆ రాష్ట్రమును కొన్ని ప్రాంతములుగ విభజించి ఒక్కొక్క ప్రాంతమున నొక్కొక్క తెగవారు నివసింపవలయునని శాసించెను. మరి కొంత కాలము గడచెను. జాషువా వృద్ధుడయ్యెను. ఆ సందర్భమున నాతడు తన ప్రజల నందరను సమావేశపరచి వారందరును పరమేశ్వరుని శాసనముల కనుగుణముగ వర్తించుచు జీవితము గడపవలయు నని శాసించెను. వృద్ధాప్యముని పోలిక వెలుగుచున్న నాయకుని గంభీరవాక్యములకు ముగ్ధులై యూదులందరును తాము భగవానునే ఎల్లప్పుడును సేవింతుమని ఏకగ్రీవముగ వాగ్దానము కావించిరి. జాషువాకు సమరాలీను లగు యూదు నాయకులు జీవించి యున్నంత కాలమును ఈ ప్రతిజ్ఞ సక్రమముగ పాలింపబడెను.

జాషువా మరణించిన నూట యేబది సంవత్సరముల తరువాత పాలస్తీనమునందు రాచరిక మేర్పడెను. ఈ నడుమ కాలమున వివిధప్రాంతములందు నివాస మేర్పరుచుకొనిన యూదు తెగలవారు తమ మండలములలో ప్రజాస్వామిక పరిపాలనమును సాగించుచు కాలము పుచ్చిరి. కొన్ని మండలములలో యూదు లత్యధికసంఖ్యాకులుగ నుండిరి. కావున

వారి కట్టి తొందరలును కలుగలేదు. వారి జీవితము శాంత ముగ గడచిపోయెను. కాని మరికొన్ని మండలములలో అధిక సంఖ్యాకులగు స్థానికప్రజల నడుమ అల్పసంఖ్యాకులగు యూదులు నివాస మేర్పరుచుకొనిరి. వీరికి స్థానికులగు కానాన్ ప్రజలతో తరచు యుద్ధములు సంభవించు చుండెను. ఆ సందర్భములలో ఆ మండలములోని స్థానికవీరులు తమ జాతిని రక్షించుటకై పోరాటములు సాగించుచు వచ్చిరి. ఇట్టి యూదు జాతీయ నాయకులు పలువురు కలరు. వారిలో ఓథ్నియల్ అను నాతడు ప్రథముడు. ఈతడు యూదు ప్రజలను చూషాన్ అను పరరాజుల పరిపాలననుండి విడిపించెను. ఈ కాలమున యూదు ప్రజలకు బాధ కల్గించుచుండిన వారిలో ఫిలిస్తైనులను నీటిదొంగల జాతివా రొకరు. వీరు క్రీట్ ద్వీపమున నివసించెడివారు. కొంత కాలమునకు ఫిలిస్తైను జాతి వారు కొందరు పాలస్తీనముపై దండెత్తి, దక్షిణప్రాంతమున సముద్రతీరమున కొంత రాజ్యము నాక్రమించుకొని శాశ్వత నివాసము కల్పించుకొనిరి. వీరు బలాఢ్యులు. యుద్ధకుశలురు. ఫిలిస్తైనులు తమ దుర్గములలో నివసించుచు అప్పుడప్పుడు తమకు సమీపమున నివసించుచున్న యూదు ప్రజలను దాకి దోచుకొనుచుండుట వాడుకగ నుండెను. చిరకాలమువరకును యూదు లీ బాధల ననుభవించిరి. తుదకు డేవిడ్ అను ప్రసిద్ధ

కైన యూదురాజు కాలమున ఫిలిస్తీనులు సంపూర్ణముగ నణచివేయబడిరి. మనము వర్ణించు కథాకాలమున డిబోరా అను ధీరవనిత యూదులకు శత్రువులగు రాజులతో పోరాడి విజయముల సాధించినట్లు యూదు గ్రంధముల వలన తెలియు చున్నది. మరి కొంతకాలము గడచిన వెనుక అరిబ్బు జాతి వారు కొందరు యూదు ప్రజలను హింసించి, వారి పైరు పంటలను నాశనముచేసి వారిని దోచుకొనుట ప్రారంభించిరి. ఈ సందర్భమున గిడియన్ అను నొక వీరుడు యూదులకు నాయకత్వము వహించెను. ఈ వీరుని సేనయందు పలువురు చేరుట కుత్సహించిరి. కాని ఆత డందుల కంగీకరింపక ధీరు లును, దృఢనిశ్చయులును, బలాఢ్యులు నగు మున్నూర్గురు సైనికుల మాత్రము సహాయముగా గొని ఒకనాటి రాత్రి శత్రుశిబిరముపై దాడి సల్పెను. యూదు సైనికు లందరికడను కొమ్ముబూరలుండెను. వారందరును కూడ ఒక్కొక్క కాగడాను వెల్గించుకొని, దాని కాంతిని మరుగుపరచుటకై కాగడాలపై కుండల నుపయోగించి నిశ్శబ్దముగ శత్రుస్కంధావారమును చేరిరి. తక్షణమే యూదులు ప్రతిపక్షులకు గర్భనిర్భేదకముగ మున్నూరు కొమ్ము బూరలను పూరించి, మున్నూరు కర దీపికలను వెల్వరించిరి. నిద్రనుండి అకస్మాత్తుగ మేల్కొనిన అరబ్బులు కింకర్తవ్యతామూఢులై యిటు నటు పరువులెత్తి సాగిరి. యూదు నాయకుడగు గిడియన్ వారిని చుట్టుముట్టి

సంపూర్ణముగ నోడించి పారద్రోలెను. గిడియన్ సాధించిన ఈ మహత్తర విజయమునకు మిక్కిలి సంతసించి ఆతనిని రాజపదము నధిష్ఠించి తమ్ము పాలింపవలసిన దని యూదులు ప్రార్థించిరి. కాని నిర్లిప్తుడగు గిడియన్ అందుల కంగీకరింప లేదు. "నేను మీకు రాజుగ నుండజాలను. నా కుమారుడు సైతము ఈ గౌరవము నంగీకరింప జాలడు. పరమేశ్వరుడే మీకు రాజు." అని యాతడు పల్కెను. యూదు ప్రజలు రాజత్వమును నెలకొల్పుటకై ప్రయత్నించుటకి దియే ప్రథమ పర్యాయము. గిడియన్ మరణానంతరము ఆతని కుమారులలో నొకడు స్వార్థపరుడై తాను యూదులకు రాజునని ప్రకటించెను. కాని అనతికాలములో నాతని యసమర్థత వలనను, దౌర్జన్యము వలనను, ప్రజల కాతని యెడ నసహ్యత జనించి వారాతనిని తొలగించిరి.

యూదుల చరిత్రయందు విఖ్యాతిగాంచిన జాతీయ నాయకులలో శామ్సన్ అను నాతడు మిక్కిలి ప్రసిద్ధుడు. ఈతడు మహాబలాఢ్యుడు, భీమపరాక్రముడు. ఈతని పేరు వినినంతనే యూదులకు శత్రువులగు ఫిలిస్తైనులు గడగడ వడకు చుండిరి. కావున వారెట్లైన శామ్సనును భంగపరచవలయు నని పన్నాగములు పన్నసాగిరి. వారు డిలైలా అను స్త్రీని ప్రోత్సహించి శామ్సను రహస్యము నెట్లైన కన్గొని ఆతని శక్తిని నశింపజేయవలసినదిగా కోరిరి. ఆ స్త్రీ తన మాయో

పాయములచే శామ్సనును వశపరచుకొనెను. శామ్సనుకు గల అసాధారణ బలమునకు మూల మాతని కేశజాలము. అవ్వివి పోయిన నా డాతడు తన బలమును గోల్పోవును. ఒకనాటి రాత్రి శామ్సను నిద్రించుచున్నప్పుడు దిలైలా ఆతని కేశజాలమును కత్తిరించి వైచెను. దానివలన నాతడు క్షీణ సత్త్వుడై శత్రువులచే జిక్కెను. శత్రువులకడ బందీగ నున్న కాలమున శామ్సను కంధత్వము సంప్రాప్తించెను. ఈ విధముగ నిస్సహాయుడై యున్న శామ్సను నాతని శత్రువులగు ఫిలిస్తైనులు పరిపరి విధముల బాధించి, అవమానింప సాగిరి. ఒకనాడు ఫిలిస్తైను జాతివారికి పండుగ వచ్చెను. ఆ దినమున వా రనేక వినోదములలో కాలము పుచ్చి తుదకు ప్రముఖు లందరు నొక పెద్ద ఒంటిస్తంభపు భవనములో సమావేశమై శామ్సనును రావించి, ఆతనికి గల అసాధారణబలమును తమ ముందు ప్రదర్శింపుమని ఆజ్ఞాపించిరి. మానవంతుడగు శామ్సను ఈ యవమానమును భరింపజాలక తన ప్రాణములకు మోసము వచ్చినను సరకుగొనక ఆనాడు ఫిలిస్తైనుల కొక కఠినశిక్షను విధింపవలె నని నిశ్చయించెను. కొంతసేపటివరకును ఆతడు తన బలప్రదర్శనమును కావించి, భవనభారము నంతను వహించియున్న యేకస్తంభమును సమీపించి దానిని పెకలించి వైచెను. తక్షణమే ఆ శాల యంతయు కూలి ఫిలిస్తైను ప్రముఖు

లందరును ప్రాణముల గోల్పోయిరి. వారితో పాటు మానధను డగు శౌమ్సను కూడ మరణించెను.

క్రీస్తునకు పదునొకండు శతాబ్దులకు పూర్వము ఎఫ్రెయిమ్ అను మండలమున "ఎలి" అను యూదునాయకు డొకడు పరిపాలించుచుండెను. ఈతనికిని ఫిలిస్తైను జాతివారికిని తరచు యుద్ధములు సంభవించుచుండెను. "ఎలి" యోగ్యుడు. ధర్మాత్ముడు. కాని ఆతని కుమారులు దుర్మార్గులు, భోగలంపటులు. ఫిలిస్తైనులతో ఒక పర్యాయము "ఎలి" యుద్ధము సాగించెను. ఎలి కుమారులు తమతో కూడ "దివ్యనౌకను" గొనిపోయిరి. (జలప్రళయము సంభవించి ప్రపంచమంతయు మునిగిపోయిన సందర్భమున పరమేశ్వరు డొక నౌకను పంపి పురాణపురుషు డగు నోహ నందు తలదాచుకొని ప్రాణము కాపాడుకొనునట్లు ఏర్పాటుచేసెను. ఇదియే దివ్యనౌక.) ఈ దివ్యనౌక తమతో కూడ నుండిన పక్షమున తమకు జయము సిద్ధించునని యూదులు తలంచిరి. కాని దైవమన్యథా నిర్ణయించినందున ఫిలిస్తైనులే జయమును సాధింపగల్గిరి. "ఎలి" కుమారులు రణభూమికి బలియైరి. దివ్యనౌక శత్రువుల చేజిక్కెను. ఈ దుర్వార్త విని వృద్ధుడగు ఎలి గుండెపగిలి చనిపోయెను. యూదులకు భావియంతయు అంధకారబంధురముగ కాన్పింపసాగెను. కాని సూర్యోదయమునకు పూర్వమే అంధకారము గాఢతమముగ కాన్పించునని వారెరుంగరు.

"ఎలి" మరణించి నప్పుడు ఆతని పట్టణమగు షిలో యందలి దేవస్థానమున "శామ్యుల్" అను ఎనిమిది సంవత్స రముల బాలుడుండెను. ఆతడు భగవత్ప్రీతికి పాత్రుడైనట్లు మొదటి నుండియు నిదర్శనములు కానవచ్చుచుండెను. తన బాల్యమునందు యూదుజాతికి సంభవించిన పరాజయము లును, ఆపదలును ఆతడు గుర్తెరింగి వారి నెట్లైన పునరుద్ధరింప వలయునని తీవ్రముగ ఆలోచింపసాగెను. యూదులను యుద్ధ రంగమున నోడించిన ఫిలిస్తైనులు వారి ననేకవిధముల బాధింప సాగిరి. యూదులకడ నున్న ఆయుధముల నన్నిటిని ఫిలిస్తైనులు లాగుకొనిరి. వారు మరల ఆయుధములను సిద్ధపరచుకొన కుండుటకై యూదు లెవ్వరును కమ్మరి దుకాణముల నెల కొల్ప రాదని ఫిలిస్తైను లాజ్ఞాపించిరి. నాగలికర్రును చేయించు కొనుటకై యూదులు ఫిలిస్తైనుల వద్దకు పోవలసిన దుస్థితి వచ్చెను. కాని శామ్యూల్ నిరుత్సాహపడక తన జాతిని పునరుజ్జీవితను కావించుటకై యత్నింపసాగెను. ఆతడు మిజ్పె అను ప్రదేశమున యూదుల నందరను సమావేశపరచి తమ ప్రాచీన సాంప్రదాయముల కనుగుణ్యముగ ప్రార్థనాదికముల కావింప సాగెను. ఫిలిస్తైనులు యూదులలో కానవచ్చుచున్న ప్రబోధమును సహింపజాలక వారి దేవస్థానములపై దాడి వెడలిరి. కాని యూదులు ధైర్యమును పూని శత్రువులపై తిరుగబడి వారి నోడించి తరిమివైచిరి. ఈ విజయము వలన

వారి కాత్మవిశ్వాసము హెచ్చెను. కాని తమ రాజ్యాంగ వ్యవస్థను సంస్కరించుకొనిన గాని ఫిలిస్తైనుల జయించుట సాధ్యముకాదని యూదులకు తెలియవచ్చెను. శామ్యూల్ సజ్జనుడే కాని ఆతని యందు రాజధర్మమును నిర్వహింపగల కాఠిన్యమును, తదితర లక్షణములును కొరవడి యుండెను. కావున యూదులకు యుద్ధరంగమున నాయకత్వము వహింప గల రాజును నిర్ణయింపవలసిన బాధ్యత శామ్యూల్‌పై మోపబడెను. ఆతడు తీవ్రముగ నాలోచించి సాల్ అను నాతడీ యున్నతపదవి కెంతయు నర్హుడని నిర్ణయించెను. సాల్ "అమ్మోనైట్లు" అను వారిని రణరంగమున నోడించి ప్రఖ్యాతి గాంచియుండెను. యూదు లాతనిని తమకు రాజుగ నుండ వలసినదని ప్రార్థింపగా నాతడందుల కంగీకారము చూపెను.

## యూదుల మొదటిరాజు సాల్

ఈ రాజు క్రీస్తునకు 1020 సంవత్సరములకు పూర్వము రాజ్యాధికారమును బూనినట్లు తెలియుచున్నది. ఈత డప్ప టికే వయసు మరలినవాడు. ఈతని కుమారుడగు జొనాధన్ అను నాతడీ కాలమునాటికి సంప్రాప్తవయస్కుడై మహావీరు డని ఖ్యాతి గాంచెను. సాల్ రాజు పరిపాలనము ప్రారంభింప గనే ఫిలిస్తైనులకును యూదులకును యుద్ధము సంభవించెను. ఫిలిస్తైనులు బలవత్తరమైన సేనను సమకూర్చు కొనిరి.

యూదులసంఖ్య మిక్కిలి తక్కువగా నుండెను. అయినను యూదులు నిరాశచెందక యుద్ధమును సాగించిరి. ఒకనాటి రాత్రి యువరాజగు జొనాథన్ ఒక్క సైనికుని మాత్రము సహాయముగ గైకొని ఫిలిస్తైనుల వశమందున్న యొక కోటను ప్రవేశించి, పలువురు శత్రువులను సంహరించెను. శత్రువులు మిక్కిలి భయపడి, దిక్కుతెలియక ఇటునటు పారిపోవ సాగిరి. ఇంతలో సాల్ రాజు తన సేనతో శత్రువులను దాకి వారిని సంపూర్ణముగ నోడించెను. ఈ విజయము వలన యూదులలో నుత్సాహము హెచ్చెను. యూదులు కానాన్ రాష్ట్రమును ప్రవేశించినప్పటి నుండియు వారిని "అమలిక్కైట్లు" అను తెగవారు మిక్కిలి బాధించుచుండిరి. వీరు సమీపమందలి ఎడారులలో నివసించుచు, తమ చురుకైన గుఱ్ఱముల మీదను ఒంటెల మీదను ప్రయాణము చేసివచ్చి యూదులను దోచుకొని అతిశీఘ్రముగ నదృశ్యు లగుచుండిరి. యూదుల కడ అశ్వికసైన్యము కొరవడియుండిన కారణమున వారు నిస్సహాయులై యూరక చూచుచుండవలసి వచ్చెడిది. సాల్ రాజీ దోపడిగాండ్రపై దండెత్తి వారిని ఎడారులలోనికి తరిమి నిలువనీడ లేకుండ వారిని పరాజితుల కావించెను. అది మొదలుగ "అమలిక్కైట్లు" చాలకాలమువరకును యూదులను బాధించుట మానిరి. యూదు రాష్ట్రమున శాంతి యేర్పడెను. సాల్ రాజు కీర్తి నలుదెసల వ్యాపించెను.

అయినను ఈ రాజు పరిపాలన శాంతముగ సాగలేదు. సాల్‌ను రాజుగ నెన్నుకొనవలసిన దని యూదులకు బోధించిన సామ్యూల్ ఏ కారణముననో సాల్‌రాజుతో సహకరింప డయ్యెను. మతాధికారులు కూడ రాజు నెడ విముఖులైరి. అందులకు తోడు రాజు తరచు విచిత్రముగ వర్తింపసాగెను. విచిత్రవర్తనము కొన్ని సందర్భములలో బుద్ధిచాంచల్యముగ మారుచుండెడిది. ఇట్టి తరుణములందు సాల్ రాజు అవివేకిగను, క్రూరుడుగను వర్తించుచుండెను. కాని ఈతడు ప్రజల గౌరవమును మాత్ర మెన్నడును కోల్పోవలేదు. సాల్ రాజు తన మరణమువరకును సరళజీవితమునే గడపెను. ఆతడు ధనవ్యయము కావించి రాజభవనముల నిర్మింపలేదు. ప్రజలను పీడించి, స్వసౌఖ్యమునకై ద్రవ్యమును వెచ్చింపలేదు. యువ రాజగు జోనాథన్ కూడ తండ్రివలెనే మిక్కిలి యోగ్యవర్తనుడై ప్రజాభిమానమును చూరగొనెను.

ఫిలిస్తైనులకును యూదులకును మరల యుద్ధము సంభవించెను. ఈ పర్యాయము ఫిలిస్తైనులకడ "గోలియత్" అను మహాకాయుడగు వీరుడు తోలుపు కుదిరెను. ఈతడు మహా బలాఢ్యుడు. గోలియత్ అనుదినమును తనతో పోరాడగల సాహసికు డెవడైన తమ సైన్యములో నున్న పక్షమున పంపవలసిన దని యూదులను సవాలుచేయు చుండెడివాడు. యూదులు భయపడి చాలదినములవరకును ఎవ్వరిని ద్వంద్వ యుద్ధమునకు పంపలేదు. తుదకు జెస్లెహామ్ పట్టణమున

నివసించు డేవిడ్ అను యువకుడు తాను గోలియత్‌తో యుద్ధమును కావించెదనని ముందంజ వేసెను. ఈతని కడ నున్న బలవత్తరమైన ఆయుధ మొక వడిసెల మాత్రమే కాని దీని నుపయోగించుటలో డేవిడ్ మిక్కిలి సమర్థుడు. గోలియత్ దుర్భేద్యమగు కవచమును ధరించి యుద్ధమునకు సిద్ధపడెను. ఆతని ఆయుధములు భయంకరమైనవి. కాని వాని బరువు వలన నాతడు చురుకుగ నడువజాలకుండెను. డేవిడ్ కూడ కవచమును ధరించి వడిసెలను చేబూని యుద్ధమునకు దిగెను. కాని ద్వంద్వయుద్ధము మిక్కిలి శీఘ్రముగా సమాప్తి చెందెను. డేవిడ్ వడిసెలనుండి తీవ్రవేగమున వెల్వడిన ఒక చిన్న పలుగు గోలియత్ మెదడునకు తగిలి ఆతనిని పరిమార్చెను. యూదులకు గోలియత్ మరణము కొండంత బలమునిచ్చెను. సౌల్ రాజు, డేవిడ్ కావించిన సేవకు మిక్కిలి సంతసించి ఆతనిని తన అంగరక్షకునిగ నియమించుకొనెను. త్వరలోనే ఆతనికి సైన్యాధిపత్యము లభించెను. రాజు డేవిడ్‌నకు తన కుమార్తె నిచ్చి వివాహము చేసెను. డేవిడ్ శూరుని కీర్తి నానాటికిని హెచ్చనాగెను. సౌల్ రాజునకు డేవిడ్ కీర్తి ప్రఖ్యాతులు కంటకముగ దోచి ఆతని చంపవలయునని యత్నించెను. మార్గాంతరము లేక డేవిడ్ దేశమునుండి పారిపోయి ఫిలిస్టైనులవద్ద కొలువు కుదిరెను. కాని ఆతనికి సౌల్ రాజు యెడ భక్తిగౌరవములు మాత్ర మిసుమంతయు క్షీణింపలేదు. అనతికాలములో ఫిలిస్టైనులకును యూదులకును మరల

యుద్ధములు సంభవించెను. కాని అదృష్టవశమున డేవిడ్‌కు ఫిలిస్తైనుల పక్షము వహించి స్వజాతీయులతో పోరాడవలసిన దుర్గతి కలుగలేదు. గిల్బోవా అను ప్రదేశమున యూదులకును ఫిలిస్తైనులకును ప్రవర్తిల్లిన భయంకర యుద్ధమందు సాల్ రాజు కుమారులందరును నిహతులైరి. రాజునకు తీవ్రమైన గాయములు తగిలెను. శత్రువు లాతని చెరపట్టు స్థితి యేర్పడెం చెను. అట్టి యవమానము కల్గుటకు పూర్వమే సాల్ రాజు తన ఖడ్గమునకు తానే బలి యయ్యెను. సాల్ రాజు మరణ వృత్తాంతము విని డేవిడ్ మిక్కిలి దుఃఖించెను.

## డేవిడ్ రాజు

సాల్ రాజు మరణించిన వెనుక యూదులకు ప్రభు వెవ్వరు కావలయు నను సమస్యపై ప్రజలయందు భేదాభి ప్రాయము లుద్భవించెను. సాల్ కుమారుడగు "ఎష్‌బాల్" అను నాతడు జీవించి యుండెను. కాని ఆత డసమర్థుడు. జొనాథన్ కుమారు డగు మెరిబ్ బాల్ అను మరియొక రాజవంశీకుడు కూడ ఆనాటికి సజీవుడై యుండెను. ఈతడు వికలాంగుడు. యూదులలో కొన్ని తెగల వారు సాల్ వంశ మునెడ భక్తిని వీడక ఆతని కుమారుని రాజుగ కావింప వలయునని యత్నించిరి. కాని జుదా రాష్ట్రమందలి ప్రజలు డేవిడ్ యొక్క సామర్థ్యమును గుర్తించి, ఆతనినే రాజుగ

నెన్నుకొనిరి. కొంతకాలము డేవిడ్ పక్షమునకును సాల్ వంశము వారికిని అంతర్యుద్ధము సాగెను. తుదకు డేవిడ్ పక్షమునకే విజయము సిద్ధించెను. డేవిడ్‌నకు సమీపబంధువుడును, సర్వసేనానియునగు "జోఅబ్" అను వీరుడీ యుద్ధమునందు రాజునకు చాల సహాయపడెను. సాల్ కుమారుడగు "ఎష్‌బాల్"ను అతని సేవకు డొకడు చంపెను. ఇక డేవిడ్‌కు ప్రతిపక్షులుగ నిలువగల వా రెవ్వరును లేరు. ఈ విధముగ క్రీస్తునకు వేయి సంవత్సరములకు పూర్వము డేవిడ్ యూదు రాజ్యమున కేలిక యయ్యెను.

యూదు లీ విధముగ బలపడుచుండుట వారి శత్రువులగు ఫిలిస్తైనులకు భయము కల్గించెను. వారు బలవత్తర మగు సేనను కూర్చుకొని యూదు రాజ్యముపై దాడి వెడలిరి. డేవిడ్ వద్ద తగినంత సేన లేనందున అతడు దేశమును విడచి పారిపోయి పర్వతములలో తల దాచుకొనవలసి వచ్చెను. కాని అత డోటమి నంగీకరింపక అదను దొరికినప్పుడెల్ల శత్రువులను దాకి, చికాకు పరచుచు క్రమక్రమముగా తన బలమును వృద్ధిపరచుకొని, తుదకు ఫిలిస్తైనులను తన రాజ్యమునుండి తరిమివైచెను. అంతటితో నాగక డేవిడ్ రాజు ఫిలిస్తైనుల రాజ్యముపై దండెత్తి దానిని కూడ జయించెను. అంతట మార్గాంతరము లేక ఫిలిస్తైనులు డేవిడ్‌ను తమకు సామ్రాట్టుగ నంగీకరింప వలసి వచ్చెను. వారిలో ప్రముఖులగువారు డేవిడ్ రాజు వద్ద కొలువు నంగీకరించిరి.

డేవిడ్ రాజు సాధించిన ఘనకార్యములలో జెరూసలేమ్ పట్టణమును జయించుట ముఖ్యమైనది. ఇయ్యది మిక్కిలి పురాతనమైన నగరము. కాని ఇంతవరకును యూదులు దానిని జయింపలేదు. ఇయ్యది "జెబుసైట్లు" అను తెగవారి అధీనమం దుండెను. జెరూసలేమ్‌ను తనకు స్వాధీన పరచవలసినదని డేవిడ్ పంపిన సందేశమును వారపహాస్యము చేసిరి. జెరూసలేమ్ కోటదుర్భేద్యమైనది. కుంటివారును, గ్రుడ్డివారును కూడ కోటను శత్రువులనుండి రక్షింపగలరని జెబుసైట్లు సగర్వముగ పలుకసాగిరి. నిజమున కాదుర్గము మిక్కిలి బలవత్తరమైనది. జెరూసలేమ్ నగరము సముద్రమట్టమునకు 2500 అడుగుల ఎత్తైన ప్రదేశముపై నెలకొని యున్నది. అయ్యది దేశమధ్య మందున్నను సులభముగ చేరుటకు వలను కాకుండెను. పట్టణము చుట్టును ఇరుకైన కొండదారులును, దుర్లంఘ్యములగు పాషాణములును నెలకొని ఆ ప్రకృతి దుర్గమును సంరక్షించుచుండెను. అనేకులు ప్రభువులీ పట్టణము నాక్రమించుకొనుటకై యత్నించి విఫలమనోరథులై మాయోపాయముచేతను, ధనాశ చూపియు తమ లక్ష్యమును సాధింపవలసిన వారైరి. అయినను డేవిడ్ రాజు జెరూసలేమ్ నగరమును స్వాధీన పరచుకొనెను. ఆతడా నగరమును రాజధానిగ కావించుకొని తన నివాసమునకై చక్కని ప్రాసాదమును నిర్మించెను. రాజకీయ విషయములలో మాత్రమే గాక మతవిషయములలో కూడ జెరూసలేమ్ నగరమునకు

చాల ప్రాముఖ్యత కల్గింప వలయుననను నుద్దేశ్యముతో డేవిడ్ రాజచ్చట సుప్రసిద్ధమగు నొక దేవాలయమును నిర్మింప వలయునని సంకల్పించెను. కాని దైవజ్ఞుడగు నాథన్ అను నాతడు జెరూసలేమ్ దేవాలయమును నిర్మించు మహద్భాగ్యము డేవిడ్ రాజు కుమారుడగు సాలమన్‌కు చెందవలయునని విధివిర్ణయమని తెలిపిన మీదట ఆతడా ప్రయత్నమును విరమించి, తన కుమారుని యత్నమును సఫలము కాగలందులకు ఆలయ నిర్మాణమున కావశ్యకములైన వస్తు జాలమును, ధనమును సేకరింప సాగెను. యూదులకు పరమ పవిత్రమైన "దివ్యనౌక"ను కొంతకాలమునకు పూర్వము ఫిలిస్తైను జాతి వారు వశపరచుకొనినట్లు మనము స్థలాంతరమున తెలిసికొని యున్నాము. దివ్యనౌకను అంతికాలములో ఫిలిస్తైనులు యూదులకు తిరిగి పంపివేచిరి. దానిని మిక్కిలి వైభవముతో డేవిడ్ రాజు జెరూసలేమ్ నగరమునకు తెప్పించి యొక మంటపమున నెలకొల్పెను.

డేవిడ్ రాజు తనకు శత్రువులగు వారినందరను జయించి విజయమును చేపట్టెను. సిరియా దేశపు ప్రభువులు డేవిడ్ రాజుపై యుద్ధము ప్రకటించిరి. యుద్ధము చాలకాలము నడచెను. తుదకు యూదులే శత్రువుల నోడింపగల్గిరి. దమాస్కస్ మొదలైన సిరియా పట్టణములలో డేవిడ్ రాజు తన సేనలను నిల్పెను. యూఫ్రటీస్ నది వరకును గల సిరియా రాజ్యమంతయు యూదుల వశమయ్యెను. ఈ రాజు పాలనమందున్న దేశమంతయు పాడిపంటలతోడను, వ్యాపారాభివృద్ధితోడను

మిక్కిలి సౌఖ్యవంతముగ నుండెను. ప్రజలెల్లరును సంతుష్టులై శాంతముగ జీవింపసాగిరి.

ఈ రాజు తన కుమారుల కారణమున చాల దుఃఖమునకు లోనయ్యెను. డేవిడ్ రాజుకుమారులలో "ఆమన్" అను వాడు శ్రేష్ఠుడు. "ఎబ్సాలమ్" అనువాడు తండ్రికి మిక్కిలి ప్రీతిపాత్రుడు. వీరిరువురకును తీవ్రమైన వివాదము సంభవింపగా, ఎబ్సాలమ్ తన అన్నను సంహరించెను. డేవిడ్ రాజందులకు కోపించి కొంతకాలము ఎబ్సాలమ్‌ను దేశమునుండి వెడల నడచియు, ఆతని యందలి మమకారముచే మరల పిలిపించెను. కాని విశ్వాసరహితుడైన యా రాకుమారుడు తన తండ్రిపైననే తిరుగుబాటు చేసెను. ప్రజలలో పలువురు ఎబ్సాలమ్ పక్షము నవలంబించిరి. కావున తిరుగుబాటు నణచివేయుట కష్టసాధ్య మయ్యెను. కాని సర్వసైన్యాధ్యక్షుడైన "జోఅబ్" మున్నగు అధికారులు తమ రాజు నెన్నడును విడనాడలేదు. డేవిడ్ రాజు జెరూసలేమ్ పట్టణమును వీడి పారిపోవలసివచ్చెను. ఎబ్సాలమ్ కొంత సేనను సమకూర్చుకొని తండ్రితో యుద్ధమునకు తలపడెను. రాకుమారుని పక్షము నవలంబించిన సైనికులు క్రమశిక్షణ కాని అనుభవము కాని లేనట్టి అసమర్థులు. డేవిడ్ పక్షమున ముక్కాకలు తీరిన యోధులు యుద్ధమున పాల్గొనిరి. కావున తన కుమారున కోటమి తప్పదని డేవిడ్ రాజు మొదటి నుండియు చక్కగ గ్రహించి యుండెను. రాకుమారుని కట్టి అపాయమును

రాకుండ రక్షింపుడని ఆతడు తన యోధులకు కట్టడి చేసెను. కాని యుద్ధరంగమున జోయబ్ స్వయముగ ఎబ్సాలమ్‌ను వధించెను. మిక్కిలి ప్రీతిపాత్రుడగు కుమారుడు రణభూమికి బలి యగుటచే డేవిడ్ రాజు రాళ్ళుసైతము కరగునట్లు దుఃఖించెను. దైవము తన ప్రాణముల గైకొని కుమారుని రక్షింప డయ్యెనని మిక్కిలి విలపించెను. యుద్ధానంతరము డేవిడ్ రాజు మరల జెరూసలేమ్ నగరమును ప్రవేశించెను. అచ్చట కొంతకాలము గృహకలహములు సాగెను. కాని తుదకవి కూడ శాంతించెను. దేశమున మరల శాంతి నెలకొనెను. డేవిడ్ రాజు తన జీవితకాలమందే తన కుమారుడగు సాలమన్‌ను రాజ్యాభిషిక్తుని కావించి, ఆతని మార్గము నిష్కంటకము కావించెను. డేవిడ్ క్రీస్తు పూర్వము 960 వ సంవత్సర ప్రాంతమున మరణించియుండును.

ఈ రాజు యూదు ప్రభువులలో నుత్తమోత్తముడని చారిత్రికుల అభిప్రాయము. యూదుల చరిత్రయందు మోజెస్ ప్రవక్త తరువాత గణనకు రాదగిన వాడీతడే. ఈతడు యౌవన దశనుండియు యూదు జాతికి గొప్పసేవ కావించెను. మోజెస్ ప్రవక్త యూదుల నొక జాతిగ సంఘటితము కావించెను. సాల్ వారి కొకరాజ్యమును నెలకొల్పెను. డేవిడ్ వారి కొక సామ్రాజ్యమును సంపాదించెను. ఈ రాజునందు కొన్ని లోపములు లేక పోలేదు. కాని పాపకార్యాచరణము కావించినట్లు తెలిసినమీదట నాతడు నిజముగ పశ్చాత్తాపము

చెందుచుండెను. ఆతడు మిక్కిలి నీతిపరుడు, భక్తుడు. ఆతడు పరమేశ్వరునే ఎల్లప్పుడును నమ్మి భగవన్నిర్ణయముల శిరోధార్యముగ భావించుచుండెను. డేవిడ్ రాజు గొప్ప కవి. గాయకుడు. ఆతడు యూదు దేవాలయములలో కావింపవలసిన ప్రార్థనాదికముల కనుకూలముగనుండుటకై ఉత్తమోత్తమములగు కీర్తనలను వ్రాసెను. వానినే భావికాలమున యూదులు ప్రామాణికముగ నంగీకరించిరి. ఈనాటి క్రైస్తవ ప్రార్థనాదికములలో కూడ డేవిడ్ రాజు ఉపయోగించిన ఉత్తమభాషయు, ఉదాత్తభావములును ప్రతిఫలించు చున్నవి. డేవిడ్ రాజు వీరుడు మాత్రమేకాడు. మానవహృదయమును భగవంతునిపై లగ్నము కావించుటకై కృషి సల్పిన భక్త రాజులలో నీత డొక్కడని నిస్సంశయముగ తెలుపవచ్చును.

## యూదు విక్రమార్కుడగు సాలమన్

డేవిడ్ రాజునకు బాథ్షీబా అను రాణివలన జన్మించిన సాలమన్ అను రాకుమారుడు తన ఇరువదవ యేట తండ్రియనంతరము యూదులకు రాజయ్యెను. (క్రీ. పూ. 960) ఈ రాజు శాంతిప్రియుడు. అదృష్టవశమున నీతని రాజ్యప్రారంభమునందు పరిసరరాజ్యముల స్థితిగతులు శాంతి సంరక్షణకు మిక్కిలి అనుకూలముగ నుండెను. పాలస్తీనమునకు చుట్టు ప్రక్కల నున్న చిన్నరాజ్యముల పెక్కింటిని డేవిడ్ రాజు

జయించియుండి నందున నయ్యవి సామంతమండలములుగ నుండెను. టైరుపట్టణరాజ్యము సాలమనుతో మిక్కిలి స్నేహభావమును నెరపెను. బాబిలోనియా, అస్సీరియా, ఈజిప్టు మున్నగు ప్రబల రాజ్యములు బలహీనస్థితియం దున్న కారణమున శాంతి భంగమును కల్గించు వారెవ్వరును లేకుండిరి. కావున సాలమన్ ప్రభువు తన తండ్రి సంపాదించిన ప్రబలరాజ్యమును పాలించుచు, ఆతడు సంపాదించి యిచ్చిన అపారధన సంపదను వెచ్చించి అద్భుతములగు భవనములను నిర్మించుచు మహావైభవముతో కాలముపుచ్చెను.

రాజ్య ప్రారంభ కాలమున సాలమన్ తన విశాల సామ్రాజ్యమునందు చక్కని పరిపాలనా వ్యవస్థ నేర్పాటు కావించెను. యూదురాజ్యము కొన్ని ప్రాంతములుగ విభజింపబడెను. ఒక్కొక్క ప్రాంతమున కొక్కొక్క ఉన్నతాధికారి పాలకుడుగ నియమింపబడెను. పన్నులు వసూలు చేయుటయు, శాంతిభద్రతల నెలకొల్పి యుండుటయును ఈతని ధర్మములు. టైరు రాజ్యమునకు రాజైన హీరామ్ అను నాతడు సాలమన్ రాజుకు సమకాలీనుడు. వీ రిరువురును సమాన వయస్కులగు యువకులు. హీరామ్‌నకు డేవిడ్ ప్రభువునం దత్యంత గురుభావముండెను. సాలమన్‌తో నీతడు మిక్కిలి స్నేహము నెరపెను. ఈ స్నేహసంబంధము యూదుల కనేక విధముల లాభకారిగ పరిణమించెను. ఈ కథాకాలమున యూదులు వ్యవసాయమే ప్రధాన వృత్తిగా గల్గియుండిరి.

వారి దేశమున వివిధములగు పంటలు విస్తారముగ పండు చుండెను. కాని యూదులు నౌకాయానమునందు శక్తి సామర్థ్యమును సంపాదించిన వారు కారు. అట్లుకాక ఫినీషియా జాతి వారు నౌకాయానమునందు గొప్ప నైపుణ్యమును అనుభవమును కల్గియుండిరి. పాలస్తీనము వివిధరాజ్యములతో వ్యాపారము సల్పుట కనుకూలమైన మధ్య ప్రదేశమున నెలకొని యుండెను. వ్యాపారమును సాగించు ఒంటెల గుంపుల ప్రయాణమున కనుకూలమగు మార్గము లన్నియు ఈ దేశముగుండ పోవును. ఎఱ్ఱ సముద్రములో ప్రవేశించుట కిచ్చట మంచి రేవుస్థానములు కలవు. సాలమన్ రాజువద్ద తండ్రి సంపాదించి యిచ్చిన ధనసంపద విస్తారముగ నుండెను. అటు తైరు పట్టణపు రాజుకడ కావలసినన్ని యోడలును, అనుభవజ్ఞులగు నావికులు నుండిరి. కావున నీరాజు లిద్దరును, తమకు గల అనుకూలతల నేకత్రము కావించి వ్యాపారము సాగించుటకు నిశ్చయించిరి. కావున తైరు పట్టణపు టోడలు పాలస్తీనము నందలి వస్తుజాలమును తీసికొని, హిందూదేశము, స్పైను దేశము, ఆఫ్రికాఖండము మున్నగు సుదూర ప్రాంతములతో వ్యాపారము చేయసాగెను. సాలమన్ రాజు కీర్తి ప్రాగ్దేశములం దెల్లెడల వ్యాపించెను.

సాలమన్ కావించిన ఘనకార్యములలో తన తండ్రి నిర్మించుటకు సంకల్పించి విడచిపెట్టిన దేవాలయ నిర్మాణ మొకటి. ఈ పవిత్రనిర్మాణమున కావశ్యకమగు ధనసంపద

నంతను డేవిడ్ రాజు సమకూర్చెనని యీవరకే తెలుపబడి నది. ఆ ధనమును వినియోగించి దేవాలయమును నిర్మించు టకై సాలమన్ ఉపక్రమించెను. కాని పాలస్తీనమున నానాడు సమర్థులగు పనివాండ్రు లేకుండిరి. యూదు లందరును వ్యాప సాయదారులు. వారికి భవననిర్మాణము, శిల్పము మున్నగు లలితకళ లించుకయును తెలియవు. కావున సాలమన్ రాజు తన మిత్రుడును టైరు పట్టణపు ప్రభువునగు హీరామ్ సహా యము నర్థించెను. హీరామ్ రాజు సంతోషముతో యూదు ప్రభువుతో సహకరించి అనుభవశాలురును, వివిధ నిర్మాణ కుశలురు నగు పనివాండ్రను పలువురను తన దేశమునుండి పాలస్తీనమునకు పంపెను. దేవాలయము నిర్మించుట కావశ్యక మగు కట్టె మున్నగునవి కూడ టైరు రాజ్యమునుండియే పంప బడెను. వీని కన్నిటికిని ప్రతిఫలముగ సాలమన్ రాజు తన దేశమున పండిన వివిధధాన్యములు, మద్యములు, నూనెలు టైరు రాజ్యము వారికి పంపుచుండెడివాడు. టైరు దేశపు శిల్పులు తమ నేర్పు నంతను చూపి, ఏడు సంవత్సరములలో అత్యద్భుతమైన యొక దేవాలయమును నిర్మించిరి. ఈ మహా త్తర నిర్మాణమును గూర్చిన కొన్ని యంశములు మాత్రము మనకు సమకాలీనుల వ్రాతల వలనను, బైబిలు గ్రంథము నందలి వర్ణనల వలనను తెలియవచ్చుచున్నవి.

మోరియా అను కొండపై ఈ దేవాలయమును నిర్మిం చిరి. ఈ ప్రదేశము మిక్కిలి ఎత్తుగను గంభీరముగను కాన

వచ్చును. కాని మిక్కిలి లోతైన లోయలలో నుండి పునాదులు నిర్మింపవలసివచ్చినందున ఇందుల కపారమగు ధనవ్యయమును శ్రమయును వినియోగింపవలసి వచ్చెను. ఈ దేవాలయమును నిర్మించుటకై బ్రహ్మాండమైన రాతి పలకలును, మిక్కిలి బరువైన సీడరు దూలములును వాడబడెను. ఈ రాతి పలకలను శిల్పు లసామాన్యమగు నేర్పుతో జోడించినందున చూపరుల కవి యొకే రాయిగ కాన్పించి అద్భుతమును గొల్పుచుండెనట. దేవాలయము యొక్క యెత్తు రెండునందల అడుగులు. దేవాలయపు గోడలపై బంగారు రేకులు తాపటము చేయబడి నందున యాత్రికులకు దూరమునుండియే భవన కాంతులు కండ్లు మిరుమిట్లు గొల్పుచుండెడివి. దేవళపు ద్వారము లుత్తమమగు సీడరు దారువులతో నిర్మింపబడెను. వానిపై కూడ బంగారపు రేకులు కప్పబడెను. ద్వారములపై మిక్కిలి విలువగల్గినట్టియు, ప్రకాశవంతములగు రంగులు కల్గినట్టియు తెరలు వ్రేలాడదీయబడెను. తెరలపై తీరుతీరుల పూవులు కుట్టబడి యుండెను. దేవాలయాంతర్భాగమున, అతి పవిత్రమగు వేదికపై "దివ్యనౌక" నిక్షిప్తము కావింపబడెను. ఈ ప్రదేశమునందు బంగారుతో చేయబడిన పదునే నడుగుల యెత్తుగల అప్సరోభామినుల విగ్రహములు నెలకొని యుండెను. అయ్యవి విశాలమైన తమ రెక్కలను విప్పి ఉత్తరదక్షిణ కుడ్యముల నందుకొనుటయేకాక గర్భాలయము నడుమ ఒండొంటిని తాకుచుండినందున దివ్యనౌక కొక

సహజమగు ఆవరణ ఏర్పడెను. ఈ అప్సరో విగ్రహముల యాకారవిశేషముల గూర్చిన వివరములు మనకు తెలియ రాలేదు. ఈ పవిత్రమందిరము నానుకొనియె మరియొక పవిత్రాగారముండెను. ఇచ్చట ధూపవేదిక నిర్మింపబడి యుండెను. ఈ వేదిక కూడ ఉత్తమమైన సీడరు కఱ్ఱతో చేయ బడి స్వర్ణఫలకములచే కప్పబడెను. దీనిపై పెక్కు దీపస్తంభ ము లమర్పబడి యుండెను. వానిలో నొక దానియం దెల్లప్పు డను దీపము వెల్గుచుండెడిది. దానికి సమీపముననే బల్లలపై వెండి బంగారు కలశము లనేకము లుంపబడియుండెను. ఒక దానిపై ఆహారపదార్థములు కూడ కానవచ్చెడివి. కాని దేవాలయపు పూజారులు మాత్రమే వాని నారగించుట కర్హులు. దేవాలయ భవనమునకు ముందున్న మంటపము నందు మిక్కిలి విశాలమును, నలుబదియైదడుగుల చుట్టు కొలతగల ఇత్తడివేదిక నిర్మింపబడి యుండెను. దీని కిత్తడి సముద్రమని పేరు. ఈ వేదిక పండ్రెండు ఇత్తడి ఎద్దులపై ఆనుకొని యుండెను. వేదికపై బలులొసంగ బడుచుండెను. దానిపై పూజారులు పాదప్రక్షాళనాదికముల కావించుకొను టకై కలశములతో జల మెల్లప్పుడును సిద్ధముగ నుండెడిది. మంటపముఖమున నిరుపైపులను ఇరువది అడుగుల చుట్టు కొల తయు, ముప్పది అడుగుల ఎత్తునుగల రెండు ఇత్తడిస్తంభ ములు కానవచ్చెడివి. ఈ స్తంభములు నాల్గువ్రేళ్ళ మందము గల దట్టమైన రేకులతో చేయబడినవి. టైరు దేశపు శిల్పులు

వీనిపై కలువపూవులను, దానిమ్మ పండ్లను, ఖర్జూర వృక్షములను నొక్కుడు బొమ్మలతో చిత్రించిరి.

అత్యద్భుతమును, అత్యంతరమణీయము నగు నీ దేవాలయమును నిర్మించిన పిదప సాలమన్ రాజు మహావైభవముతో దేవాలయ ప్రతిష్ఠను కావించెను. అసంఖ్యాకులగు జనులు దూరదేశములనుండి ఈ యుత్సవమును చూచుటకేతెంచిరి. వీరందరు నత్యంత భక్తిభావముతో దేవాలయాభిముఖులై నడచిరి. వీరికి పురోభాగమున రాజు స్వయముగ దారితీసెను. ఆతని వెనుక పురోహితులు నడచిరి. వీరందరును విసువు లేకుండ ప్రార్థనాగీతముల పాడుచు నృత్యము చేయుచు నడువసాగిరి. మరికొందరు పురోహితులు పరమపవిత్రమైన దివ్యనౌకను తమ భుజములపై మోసికొని వచ్చిరి. ఈ దివ్యనౌక సమీపించిన కొలదియు ప్రజలెల్లరు నత్యంత భక్తిభావముతో ప్రక్కలకు తొలగుచుండెడివారు. ఈ దివ్యనౌక యందు రెండు రాతిపలకలు మాత్ర ముండెను. వానిపై పరమేశ్వరుడగు యెహోవా స్వహస్తములతో యూదు జాతివారనుసరింపవలసిన "దశవిధులు" వ్రాసెనని వారు గాఢముగ విశ్వసించి యుండిరి. పురోహితులు దివ్యనౌకను గొనివచ్చి అత్యంతగురుభావముతో దానిని గర్భాలయమందలి అప్సరో విగ్రహముల బంగారురెక్కలక్రింద దించిరి. దానికి సమీపముననే స్వర్ణవికారమగు దీపస్తంభమును, పూజావేదికయు నిక్షిప్తము కావింపబడెను. పురోహితులు కొంచెము వెనుకకు

తగ్గిరి. అంతట గర్భాలయమందు దట్టమైన యొక వేఘ మలము గొనెను. చీకటి నలుదిక్కుల వ్యాపించెను. అతి సమీపమందున్న పురోహితుల గొండొరుల ముఖములు కాన్పింపలేదు. ఇంతలో ఎచ్చట నుండియో యొక వహ్నిశిఖ ఎగురుచు వచ్చి దేవాలయమును ప్రవేశించి దేవతానివేదన మునకై అచ్చట నుంపబడిన పదార్థముల నన్నిటిని తన లోనికి స్వీకరించెను. ఈ యద్భుతము నందరును కండ్లార గాంచి ధన్యులైరి. దేవదేవుడగు యెహోవా సాలమన్ రాజు నిర్మించిన దేవాలయమును పవిత్రీకృత మొనరించె ననియు, నివేదనకై యొసంగబడిన పదార్థములు లాతని కంగీకారముగ నుండెననియు భక్తు లీ యద్భుతసంఘటనమున కన్వయము కావించిరి. దేవాలయప్రతిష్ఠాపన సందర్భము నందలి యుత్స వము లొక పక్షము వరకును సాగెను. ఈ నూతన దేవ స్థానము నిర్మించుట వలన జెరూసలేమ్ పట్టణపు ప్రాముఖ్యత మరింత హెచ్చెను. యూదు లెల్లరును దీనిని తమ పుణ్య క్షేత్రముగ భావింపసాగిరి. ప్రతి సంవత్సరమును అసంఖ్యాకు లగు యూదు లీ దేవాలయమును సందర్శించి పాపపరిహారము కావించుకొనుటకై దూరప్రదేశములనుండి యేతెంచుచుండెడి వారు. యాత్రికుల సౌకర్యముకొరకై సాలమన్ రాజు నీటి సదుపాయములను కల్పించెను. పురపారిశుద్ధ్యత కొరకై అత డన్ని విధములైన కట్టు దిట్టముల కావించెను. ఈ రాజు

జెరూసలేమ్ కోటను బలపరచి, అందు అనేక రాజభవనముల నిర్మాణము కావించెను.

సాలమన్ రాజునకు యూదుల చరిత్రయందు గల ప్రాముఖ్యత కితరకారణములు కూడ గలవు. ఈతడు మిక్కిలి బుద్ధిశాలి. పండితుడు. కవి. ఈతని సుభాషితములు జగద్విఖ్యాతి గాంచియున్నవి. సాలమన్ రాజు న్యాయపరత్వమును, వివాదముల పరిష్కరించుటయం దాతనికి గల అసామాన్యమైన నేర్పును సూచించు అనేకగాధలు వ్యాప్తియందున్నవి. ఈతనికిగల శాస్త్రీయజ్ఞాన మపారమైనది. సాలమన్ ప్రభువు వృక్షముల గూర్చియు, క్రిమికీటకముల గూర్చియు అనేక నూతన విషయముల తెలిసికొని ఇతరులకు బోధించుచుండెడివాడు.

కాని యిన్ని సద్గుణములుగల రాజు సైతము విజయవంతముగ రాజ్యము కావింపజాలక పోవుటయు, ఈతని కాలమునందే యూదుసామ్రాజ్యము విచ్ఛిన్న మగుటకు ప్రారంభించుటయు, రాజు స్వయముగ విషయలోలుడై దుఃఖముల పాలగుటయు మిక్కిలి శోచనీయములగు సంశయములు. అపార ధన సంపదవలన లభ్యమగు విషయోపభోగములకీ రాజు వశ్యుడై పోయెను. ఈతని కనేకులు భార్య లుండెడివారు. వారిలో కొందరు యూదుమతము నంగీకరించినవారు కారు. అట్టి స్త్రీల మోహపాశమున జిక్కుకొని సాలమన్ తన మత ధర్మముల నలక్ష్యము చేయసాగెను. వార్ధక్యము సమీపించిన

కొలదియు ఆతడు యూదు మత విరుద్ధముగ విగ్రహారాధన మున్నగు వానిని కఠినముగ నణచివేయక ఉపేక్ష చేయసాగెను. జెరూసలేము పట్టణమునకు చుట్టుప్రక్కల గల కొండలపై విగ్రహారాధన కేంద్రములు వెలయసాగెను. సాలమన్ రాజు రాజ్యకాలమందు మొదటిదినములలో ఆతనికడ పుష్కల ముగ ధనముండెను. ఆ ధనసంపద నంతను డేవిడ్ రాజు సంపాదించి కుమారునికై విడచిపోయెను. కాని సాలమన్ ఆ ధనము నంతను వ్యయపరచి గొప్ప కట్టడముల నిర్మించెను. ధనమంతయు సెలవయ్యెను. కాని నిర్మింపబడిన భవనముల సంరక్షణకొరకును, ఉత్సవాదుల నిర్వర్తించుటకును ధన మా వశ్యకమయ్యెను. దీనిని రాజు ప్రజలపై క్రొత్తపన్నుల విధించి సంగ్రహింపసాగెను. పాలస్తీన మందలి ఉత్తర ప్రాంతముల వారికీ పన్నులభారము దుర్భరముగ తోపసాగెను. తమకడ నుండి పన్నుల తీసికొని ఎచ్చటనో దూరముననున్న జెరూస లేమ్ పట్టణముపై వానిని వ్యయపరచుటేల యని వారు తీవ్ర ముగ ప్రశ్నింపసాగిరి. తుదకు ఉత్తర పాలస్తీనములోని తెగల వారు రాజుపై తిరుగుబాటు చేసిరి. రాజు వాని నణచజాలక పోయెను. మరికొంత కాలమునకు ఎడొమైట్ తెగవారు బహిరంగముగ సాలమన్‌ను ధిక్కరించిరి. దమాస్కస్ పట్ట ణమున నొక స్వాతంత్ర్యరాజ్యము స్థాపింపబడెను. శాంతి ప్రియుడైన సాలమన్ ఈ యల్లకల్లోలమును చూచియు

ఏమియు చేయజాలక మూకీభావము వహించెను. తుదకు క్రీ॥ పూ॥ 930వ సంవత్సరమున సాలమన్ మరణించెను.

## యూదు రాజ్యము రెండుగ చీలిపోవుట

సాలమన్ రాజునకు ప్రపంచచరిత్రయందు దొరక అపూర్వమైన కీర్తిలభించినందున అతని పరిపాలనమందలి లోపములను లెక్కించుటకు పలువురు చారిత్రికులు పూనుకొనలేదు. కాని నిజమునకు యూదురాజ్యపు ఐక్యత చెడిపోవుట కాతని హ్రస్వదృష్టియే కారణమని తెలుపవచ్చును. ఈ రాజు తన తండ్రి యుద్దేశించిన దేవాలయమును నిర్మించుటతో సంతుష్టపడి యూరకుండలేదు. ఈతడు ధనమును విచ్చలవిడిగ వెచ్చించి కోశాగారము ననతికాలములో నిర్ధనము కావించెను. ధనమును మరల సేకరించుటయందు సాలమన్ లోపభూయిష్ఠములగు మార్గముల నవలంబించెను. జుడా, బెంజమిన్ రాష్ట్రములనుండి కొలదిపాటి పన్నులు తీసికొనబడెను. మిగిలిన భారమంతయు పాలస్తీనపు టుత్తరప్రాంతములపై మోపబడెను. ఈ అన్యాయమును గుర్తించియే ఉత్తరప్రాంతీయులు సాలమన్‌పై తిరుగుబాటు కావించిరి. ఈ తిరుగుబాటులకు "జెరోబామ్" అనువాడు నాయకత్వము వహించెను. సాలమన్ రాజు తన సేనల నీతనిపై పంపగా నీతడు పారిపోయి ఈజిప్టు దేశమున నివసింపసాగెను. ఈజిప్టురాజులు సాలమన్‌కు సమీప

బంధువులయ్యు, ఆతనిపై అసూయచే, తిరుగుబాటుదారగు "జెరోబామ్"కు తమకడ ఆశ్రయమొసంగిరి. సాలమన్ రాజు మరణించిన వెనుక నీతడు స్వదేశమునకు మరలి వచ్చి ఉత్తర పాలస్తీనమున ప్రబలిన అశాంతిని వ్యక్తీకరించుటకై నాయకత్వము వహించెను. సాలమన్ మరణించిన వెనుక ఆతని కుమారుడు "రెహోబామ్" అను నాతడు రాజ్యమున కధికారియయ్యెను. (క్రీ॥ పూ॥ 932) కాని జుడారాష్ట్రము మాత్ర మీతని యధికారమునంగీకరించెను. ఉత్తరప్రాంతముల కూడ తనకు వశము కావించుకొన వలయునను ఉద్దేశ్యముతో "రెహోబామ్" రాజు అచ్చటి తెగల ప్రతినిధులను తనకడకు వచ్చి, వారి యశాంతికిగల కారణములను చర్చింపవలెనని ఆహ్వానించెను. ఉత్తర ప్రాంతీయులకు తమ రాజుపై తిరుగుబాటు కావింప వలయునని ఎంతమాత్రము నిచ్ఛలేకుండెను. "మీ తండ్రి మాకనేక కష్టములను కల్గించి బాధించియున్నాడు. ఆ బాధలు దుర్భరములైన కారణమున మేము తిరుగుబాటు చేయవలసి వచ్చెను. ఆ అన్యాయములను తొలగించి న్యాయసమ్మతముగ పరిపాలనము కావించినపక్షమున మేమెల్లరము మీ అధికారము నంగీకరించుటకు సంసిద్ధులమై యున్నాము." అని ఉత్తరదేశీయులు రాజునకు విన్నవించిరి. కాని రాజు అవివేకి. ధూర్తులగు నాతని మిత్రులాతనిని పురికొల్పి, తిరుగుబాటుదారుల న్యాయసమ్మతమగు కోర్కెలను త్రోసిపుచ్చునట్లు చేసిరి. కావున రాజునకును తిరుగుబాటు

దాగులకును సామరస్యము కుదురలేదు. కాని మూర్ఖుడగు రెహోబామ్, వారు తనను ధిక్కరింపరని తలంచి, పన్నులు వసూలుచేయుటకై తన అధికారులను యథాప్రకారముగా ఉత్తర ప్రాంతములకు పంపెను. హతభాగ్యుడగు నా యధికారి ప్రాణముల గోల్పోవుటతో రెహోబామ్‌కు భయము కల్గెను, తనప్రాణములకు మోసమువచ్చునని భయపడి యాతడు జెరూసలేమ్ నగరమునకు పలాయన మయ్యెను. ఉత్తరప్రాంతము నందలి తెగలవారు "జెరోబామ్"ను రాజుగ నెన్నుకొనిరి. ఈ విధముగ డేవిడ్‌రాజుచే స్థాపింపబడిన యూదు రాజ్యము రెండు భాగములుగ విడిపోయెను. రెహోబామ్ పాలించెడి భాగమునకు జుడా రాజ్యమనియు, నూతనముగ నేర్పడిన రాజ్యమునకు ఇస్రాయిల్ రాజ్య మనియు ఖ్యాతిగల్గెను.

జుడా రాజ్యమునందు రెండు తెగలు మాత్రమే నివసించియుండెను. ఇస్రాయిల్ రాజ్యమున పది తెగలవారు నివాసముగ నుండిరి. కాని ఇంత మాత్రమున ఇస్రాయిల్ రాజ్యము బలవత్తరమైనదని తెల్పుట కవకాశము లేకుండెను. రెహోబామ్ రాజు స్వయముగ నసమర్థుడైనను ఆతని కనుకూలమగు నంశము లనేకము లుండెను. ఆతని పితృపితామహులగు సాలమన్ డేవిడ్ ప్రభువులు యూదు ప్రపంచమున నఖండ గౌరవమును సంపాదించి యుండిరి. వారి వంశీయుడగు రెహోబామ్‌న కాభిజాత్యగౌరవము సంపూర్ణముగ లభించెను. అంతేకాక జుడా రాజ్యమునందలి తెగ లేక ప్రదేశమున నివసించుచుండుటయు, దేశమధ్యమున జెరూస

లేమ్ వంటి దుర్భేద్యమగు పట్టణము నెలకొని యుండుటయు, వారికి మిక్కిలి అనుకూలతను కల్గించెను. ఈ కథాకాలము నాటికి జెరూసలేమ్ పట్టణమునకు జగద్విఖ్యాతి కలుగలేదు. కాని అందలి దేవాలయమును యూదు ప్రజలందరును మిక్కిలి గౌరవ భావముతో పరిగణించుచుండిన కారణమున జుడా రాజ్యమున కొక ప్రత్యేక గౌరవము లభించెను. ఇశ్రాయిల్ రాజ్యమందు పది తెగలవారు నివసించుచుండినను, ఆ రాజ్యము విశాలతరమైనను, దానికి సహజమగు ప్రాముఖ్యత కొరవడి యుండెను. ఈ రాజ్యమునకు ప్రభుత్వము వహించిన జెరోబామ్ ఉన్నతవంశీకుడు కాడు. కావున నాతనికి రెహోబామ్‌నకు గల అభిజాత్యగౌరవము లేకుండెను. ఆతని యధికారము నంగీకరించిన ప్రజల కాతనియందు సహజమగు గురుత్వము లేదు. రెహోబామ్ రాజుపై తిరుగుబాటు చేయుట యను విషయమందు తక్క వారిని బంధింపగల స్నేహసూత్రము మరొండు లేకుండెను. జుడా రాజ్యమునందు జెరూసలేమ్ పట్టణమువలె సుప్రసిద్ధమగు జాతీయ కేంద్రము ఇశ్రాయిల్ రాజ్యమున లేదు. ఈ లోపమును పూరించుటకై జెరోబామ్ దాన్, బెథెల్ అను ప్రదేశములందు నూతన దేవాలయముల ప్రతిష్ఠాపన గావించెను. కాని వీరికి జెరూసలేమ్ పట్టణమునకు కల్గిన కీర్తి లభింపలేదు.

ఈ విధముగ విడిపోయిన జూడా ఇశ్రాయిల్ రాజ్యములు స్వతంత్రముగ నెగడ నాగెను. ఈ రాజ్యములకు

తరచు వైరములు సంభవించుచుండెను. క్రీ. పూ. 882 సంవత్సరమున ఇజ్రాయిల్ రాజ్యమునకు రాజైన "ఒమ్రి" అను నాతడు కీర్తి ప్రఖ్యాతులను సంపాదించెను. ఈ కాలము వరకును ఇజ్రాయిల్ ప్రభుత్వమునకు కేంద్రస్థానము లేకుండెను. "ఒమ్రి" రాజు సమేరియా అను ప్రదేశమున నూతన పట్టణమును నెలకొల్పి తన రాజభవనములను, ఒక గొప్ప దేవాలయమును నిర్మించెను. జూడా ప్రజలకు జెరూసలేమ్ వలెనే ఇజ్రయిల్ వారికి సమేరియా నగరము కేంద్రస్థానముగ నేర్పడి వారి ప్రేమకు తావలమయ్యెను. ఈ రాజు సిడన్ పట్టణపు ప్రభువైన ఎథ్‌బాల్ కుమార్తె జెజబెల్ అను నామెను తన కుమారుడగు అహాబ్‌న కిచ్చి వివాహము కావించెను.

తండ్రియైన "ఒమ్రి" మరణానంతరము అహాబ్ రాకుమారుడు క్రీ. పూ. 874వ సంవత్సరమున ఇజ్రాయిల్ రాజ్యమునకు ప్రభువయ్యెను. ఈతని భార్య సిడన్ పట్టణపు రాజకుమారి. ఆ కాలమున ఫినీషియా జాతివారు బాల్ అను దేవుని పూజించుచుండెడివారు. ఈ మతమునందు విగ్రహారాధనయు, మద్యమాంససేవనము, అవినీతికరములగు ఇతర దురాచారములును అనుసరింప బడుచుండెను. రాణి యైన జెజబెల్ బాల్యమునుండియు ఇట్టి ఆచారముల కలవాటుపడి యుండి నందున, ఇజ్రాయిల్ రాజ్యమునకు వచ్చిన తరువాత ఆమె తన పుట్టినింటి వారి మత విశ్వాసములను యూదు రాజ్యమున వ్యాపింప జేయుటకై ప్రయత్నించి మిక్కిలి

దుష్కీర్తి గాంచెను. ఈమె బాల్ దేవుని పూజనమునకు వ్యాప్తి కల్గించుటకై యత్నించి అనేక దేవాలయముల నిర్మింపించెను. యెహోవాను పూజించు యూదుల కనేక కష్టములు కల్గింప సాగెను. ఈ కాలమునందు యూదు మత సంరక్షణమునకై యొక మతసంస్థ నెలకొనెను. ఈ మతసంస్థకు చెందినవారు బ్రహ్మచర్యము మున్నగు కఠినవ్రతముల నవలంబింపక పోయినను, భగవత్సేవను గూర్చియు, మత గ్రంథముల పఠింప వలసిన యావశ్యకతను గూర్చియు, వైరప్రార్థనను గూర్చియు ప్రజానీకమునకు నిరంతరమును బోధించుచుండిరి. ఈ మతప్రచారకులలో వివిధమతములవారు వివిధ గురువులను పూజ్యభావముతో చూచుచుండిరి. వీరిలో పలువురు ప్రచారకులు రాణి యగు జెజబెల్ వ్యాప్తిలోనికి గొని వచ్చుచున్న విగ్రహారాధనము మున్నగు దురాచారములను ఖండించుచు మతబోధ కావింప సాగిరి. రాణికి దీనివలన మిక్కిలి ఆగ్రహము కల్గి మత ప్రచారకుల పలువుర చంపించెను.

ఇట్టి క్లిష్ట పరిస్థితులందు ఇస్రాయిల్ రాజ్యమున "ఎలిజా" అను ప్రసిద్ధమతగురువు ప్రాముఖ్యతను సంపాదించెను. ఈతని జీవిత విశేషములగూర్చి మన కేమియును తెలియరాలేదు. ఎలిజా గంభీరమైన యాకృతి గలవాడు. ఈతడొక దినమున నకస్మాత్తుగ అహాబ్ రాజు కొలువు కూటమున కేతెంచి సత్యమతమును విస్మరించి పాషండసంప్రదా

యముల తన దేశమున వ్యాప్తిచెందించుచున్న కారణమున యెహోవా ఆతనిపై కోపగించెననియు, తత్ఫలితముగ దేశమున క్షామమును, అనావృష్టియు ప్రబలబోవుచున్న వనియు రాజునకు తెల్పెను. ఈ విషయమును తెల్పి ఎలిజా అంతర్ధానమయ్యెను. దేశమున క్షామము ప్రబలుచున్న కాలమున నీ మతిగురు వెచ్చటనుండెనో ఎవ్వరికిని తెలియదు. మూడు సంవత్సరముల కాలము ప్రజలు కాటకముచే పీడింపబడిరి. ప్రజల బాధలనుచూచి సహింపజాలక అహాబ్ రాజు తన ప్రధాన మంత్రిని వెంటబెట్టుకొని ఎలిజాను వెదకుచు దేశమంతయు పర్యటనము చేయసాగెను. కాటకమునుండి తన ప్రజలను వారి పశుసంపదను రక్షించుట కుపాయము తెలుపవలసినదిగా నాతని వేడుకొనుటయే రాజు నుద్దేశ్యము. మార్గమున ఎలిజాకును అహాబ్ రాజునకును సమావేశమయ్యెను. సత్యమగు యూదు మతమునకును, ఫినీషియా వారి పాషండసంప్రదాయమునకును గల భేదమును నిదర్శనపూర్వకముగ చూపెదనని ఎలిజా ప్రతిజ్ఞ కావించెను. ఆ మరునాడు నాల్గునూర్ల ఫినీషియా పురోహితులు ఎలిజాతో వాదమునకై సంసిద్ధులైరి. వారు మొదట తమ సంప్రదాయముల ప్రకారము బలివేదికను నిర్మించి దానిపై నివేదనకై కొన్ని పదార్థములనుంచి, వానిని స్వీకరింపవలసినదని దినమంతయు ప్రార్థనాదికముల సల్పిరి. కాని యెట్టి విశేషమును చూపట్టలేదు. అంతట ఎలిజా మరియొక వేదికను ప్రతిష్ఠించి, దానిపై నైవేద్యమును

ఉంచి, దానిని గైకొనవలసినదని యెహోవాను భక్తి పూర్వకముగ ప్రార్థించెను. తక్షణమే యొక అగ్నిజ్వాల ఆకసము నుండి దిగివచ్చి నివేదన మొనర్పబడిన పదార్థముల తన లోనికి స్వీకరించెను. ప్రజలందరు నీ యద్భుతమును జూచి నిర్వెరపడిరి. అంతట ఎలిజా యాజ్ఞపై ఫినీషియా పురోహితులకు మరణశిక్ష విధింపబడెను. ఆ మరుసటి క్షణమున కుంభవృష్టిగ వర్షముకురిసి ప్రజల కానందమును గూర్చెను.

ఫినీషియా పురోహితు లీ విధముగ మరణదండనకు పాలగుట జూచి జెజబెల్ రాణి మిక్కిలి ఆగ్రహము వహించి ఎలిజాను చంపించెదనని బెదరించెను. ఎలిజా భయపడి దూర దేశమునకు పారిపోయెను. భగవంతు డాతనికి సాక్షాత్కరించి అభయహస్త మొసంగి ఇజ్రాయిల్ రాష్ట్రమున జెహూ రాజును, సిరియా దేశమున హెజాల్ రాజును ప్రతిష్ఠింపుమని ఆజ్ఞాపించెను. ఎలిజా యనంతరము ఎలీషా అను నాతడు యూదు మతమునకు గురుస్థానము నాక్రమించునని కూడ పరమేశ్వరు డాదేశించెను.

అహబ్ రాజు పేరుడు. ఈతడు జూడా రాజ్యమును విజృంభింపకుండ జేసెను. దమాస్కస్ రాజుతో యుద్ధము సంభవించి నప్పుడు ఇజ్రాయిల్ సేనలు శత్రువుల పారద్రోలి జయమును చేపట్టెను. ఈ రాజు నూతనముగ ప్రాముఖ్యతను సంపాదించుచున్న అస్సీరియా రాజ్యముతో స్నేహభావమును నెరపి రెండవ షాల్మనాసర్ రాజునకు పదివేల సేనను సహా

యముగ బంపెను. అహాబ్ జెజబెల్‌ల కుమార్తెయగు అథాలియా అను నామెను జూడా రాకుమారుడు జెహోరామ్ అను నాతడు వివాహమాడెను. ఇస్రాయిల్ రాజ్యము బలవత్తరమైనదని గుర్తించియే జూడా రాజీ వివాహమున కంగీకరించెను. మరికొంతకాలమునకు దమాస్కస్ రాజ్యమునకును ఇస్రాయిల్ రాజ్యమునకును యుద్ధము సంభవించెను. అందు అహాబ్ రాజు ప్రాణముల గోల్పోయెను.

అహాబ్ రాజు కుమారుడగు జోరామ్ రాజ్యము చేయుచున్నప్పుడు (క్రీ॥ పూ॥ 852) ఎలిజా శిష్యుడగు ఎలీషా యను మత గురువు జీవించియుండెను. ఈతడు నామన్ అను సిరియా దేశపు సేనానికి కుష్ఠురోగము సంభవింపగా దానిని నివారణచేసెను. ఈ విధముగ నాతని కీర్తి సర్వత్ర వ్యాపించెను. దమాస్కస్ రాజగు రెండవ బెన్‌హదాద్ తన సేనానియగు హెజాల్‌చే చంపబడునని ఎలీషా ముందుగనే తెలిసికొని ప్రకటించెను. దాని కనుగుణ్యముగ హెజాల్ తన యజమాని రెండవ బెన్‌హదాద్‌ను చంపి రాజ్యము నాక్రమించెను. అహాబ్ రాజు మరణించిన తరువాత జూడా రాజ్యము మరల బలవత్తరమయ్యెను. దేశము సుభిక్షముగ నుండెను. వ్యాపారము వృద్ధిచెందెను. రాజగు జెహోషాఫాట్ నౌకా వ్యాపారము నభివృద్ధికావించుటకై చాల ఓడలను నిర్మాణము చేయించెను. ఈతని కుమారుడగు జెహోరామ్ క్రీ॥ పూ॥ 846వ సంవత్సరమున రాజ్యాధికారమును బూనెను. ఈతడు

తన భార్యయగు అథాలియా దుర్బోధలకు చెవి యొగ్గి సత్య మగు యూదుమతము నవజ్ఞ చేసి, ఫినీషియా ఆచారములను, బాల్ దేవతాపూజనమును ప్రారంభించెను. దీనికి ఫలితముగ నీరాష్ట్రమున కనేకములగు ఆపదలు కల్గెను. సామంతరాజులు జూడారాజ్యముపై తిరుగుబాటు చేసిరి. అరబ్బులు జెరూసలేమ్ పట్టణముపై దాడిసల్పి, రాజప్రాసాదమును కొల్లగొట్టి, అనేకులు ప్రజలను బందీగ గొనిపోయిరి. క్రీ॥ పూ॥ 842వ సంవత్సరమున జెహూరామ్ కుమారుడు అహాజియా జుడారాజ్యమునకు ప్రభువయ్యెను. ఈతడు ఇజ్రాయిల్ రాజ్యమున కేలికయగు జోరామ్‌తో స్నేహము పాటించి దమాస్కస్ రాజ్యముపై యుద్ధమునకు దిగెను. యుద్ధమున యూదు ప్రభువులకే పరాజయము కల్గెను. జోరామ్ రాజు గాయపడెను.

ఇట్టి అసహాయస్థితియందున్న జోరామ్‌పై జెహూ అను ఆతని సేనాని తిరుగుబాటు చేసెను. కాని రాజునకీ యంశము తెలియదు. తన్ను సందర్శింప వచ్చిన సేనానిని యుద్ధవృత్తాంతముల తెల్పుమని రాజు ప్రశ్నించెను. కాని మరుసటిక్షణమున జెహూ దురుద్దేశ్యమును తెలిసికొని జోరామ్‌ను, అతని మిత్రుడగు అహాజియాయును మరలిపోవుటకై యత్నించుచుండగా జెహూ వారిని చంపించెను. రాజు నీ విధముగ సంహరించి విజయగర్వముతో జెహూ రాజధానీనగరమును ప్రవేశించెను. (క్రీ॥ పూ॥ 842) కాని రాజమాతయగు జెజబెల్ అప్పటికి జీవించియే యుండెను.

తనకు కూడ కుమారుని గతియే పట్టునని ఆమెకు తెలియక పోలేదు. కాని నిర్భీకురాలగు నామె తన ఆభరణముల నన్నిటిని ధరించి, రాజమాత కర్హమగు దుస్తులతో తన మేడపై నిలుచుండి జెహూ సేనాని సమీపించగనే "రాజహంతకుడగు సేనానికి స్వాగతము" అని అపహాస్యముచేసెను. జెహూ దీనిని సహింపజాలక తన సేవకులచే నామెను మేడపైనుండి క్రిందికి త్రోయింపగా రథములను, గుఱ్ఱములను నామె పైనుండి సాగిపోయెను. జెజబెల్ దేహము తునకలై పోయెను. ఆమె మృతదేహము కుక్కలు, నక్కలు మున్నగు క్షుద్రజంతువుల కెర యయ్యెను.

## ఇస్రాయిల్ రాజ్యము నశించుట

జెహూ సేనాని ఇస్రాయిల్ రాష్ట్రము నందొక నూతన రాజవంశమును స్థాపించెను. ఈ రాజవంశము వారి కాలమున ప్రత్యేకముగ స్మరింపదగిన చారిత్రికాంశము లేవియును కానరావు. ఇస్రాయిల్ జూడా రాష్ట్రము లొండొంటితో కలహించు చుండెడివి. దమాస్కస్ రాష్ట్రముతో వీరికి తరచు యుద్ధములు సంభవించుచుండెను. క్రీ.పూ.736 వ సంవత్సరమున ఇస్రాయిల్ రాజును, దమాస్కస్ రాజును ఏకస్థులై బలహీనుడైన జూడా రాజుపై దండెత్తి ఆతనిని సంపూర్ణముగ నోడించిరి. దమాస్కస్ రాజు జూడా ప్రజ

లను పలువురను చెరపట్టి సిరియారాష్ట్రమునకు గొనిపోయెను. ఇశ్రాయిల్ రాజుసైతము మీ పద్ధతినే అవలంబించి మరికొందరు యూదులను చెరపట్టి స్వదేశమునకు గొనిపోయెను. కాని ఆతని ప్రజలు స్వజాతీయులగు జూడా ప్రజల దుఃఖమును చూచి భరింపజాలక తమ సైనికుల ధిక్కరించి, బందీల విడిపించి, వారిని సగౌరవముగ వారి యిండ్లకు పంపివైచిరి. అహంకార క్రూరత్వములతో నిండియున్న యీ అంధకార యుగమున ఇశ్రాయిల్ ప్రజల ప్రవర్తన ముజ్జ్వలమగు నాశాకిరణమువలె కాన్పించుచున్నది.

కాని ఇశ్రాయిల్ దమాస్కస్ రాజులు జూడా రాజ్యమునకు కల్గించిన బాధ యతితీవ్రపరిణామములకు కారణమయ్యెను. జూడా రాజు వీరి దౌర్జన్యముల సహింపజాలక అస్సీరియా రాజగు మూడవ టిగ్లాథ్ పిలాసిరెను శరణువేడెను. ఈ కథాకాలమునాటికి అస్సీరియా రాజ్యము ప్రబలమగు స్థితియందుండెను. టిగ్లాత్ రాజు దమాస్కస్ రాజ్యముపై దండెత్తి రాజును సంహరించి పలువురు ప్రజలను చెరపట్టి స్వదేశమునకు గొనిపోయెను. ఇశ్రాయిల్ రాజ్యమునకు కూడ ఈ గతియే పట్టెను. క్రీ॥ పూ॥ 732వ సంవత్సరమున అస్సీరియా రాజు ఇశ్రాయిల్ రాష్ట్రమునందలి అనేక ప్రాంతముల జయించి, అనేకుల ప్రజల చెరపట్టి దేశమునంతయు నాశనము కావించెను. ఆనాటినుండియు ఇశ్రాయిల్ రాజులు స్థానికులగు చిన్న ప్రభువులుగ మారి, అస్సీరియా రాజ్యము

నకు సామంతులైరి. మూడవ టిగ్లాథ్ రాజు మరణించిన వెనుక ఆతని ఇతర సామంతులతోపాటు ఇజ్రాయిల్ రాజుసైతము అస్సీరియాను ధిక్కరించెను. అంతేకాక ఆతడు బహిరంగముగ అస్సీరియాతో స్నేహసంబంధములు కల్పించుకొనియు, రహస్యముగ నీజిప్టురాజుతో చేరి కుట్రలు చేయసాగెను. ఇజ్రాయిల్ ప్రభువుల ప్రవర్తనమువలన విసువుచెంది క్రీ॥ పూ॥ 722వ సంవత్సరమున సారగాన్ అను అస్సీరియా రాజు ఇజ్రాయిల్ రాష్ట్రపు రాజధానియగు సమేరియా నగరము నాక్రమించెను. ఇజ్రాయిల్ ప్రజలలో ప్రముఖులగువారు పలువురు అస్సీరియా దేశమునకు బందీలుగ కొనిపోబడిరి. పేదవారు మాత్రమే స్వరాష్ట్రమున నుండిపోయిరి. వీరు పరరాజ్యములనుండి ఇజ్రాయిల్ రాష్ట్రములోనికి వచ్చిన వారితోడను, స్థానికులగు కానాన్ ప్రజలతోడను వివాహసంబంధములు కల్పించుకొనుచు తమ వ్యక్తిత్వమును గోల్పోయిరి. యూదులు కాని వారితో వివాహములు చేసికొనరాదను దీక్ష ఈజాతి వారియందా నాటికి నెలకొనలేదు.

## జూడా రాజ్యమొంటరిగ నిలువబడుట

ఇజ్రాయిల్ రాజ్యము క్రీ॥ పూ॥ 722 వ సంవత్సరమున నశించిన విధము మనము చూచియున్నాము. ఇందులకు పది సంవత్సరములకు పూర్వము జూడారాష్ట్రము మస్సీరియా

ప్రభుత్వమువారి సహాయమును కోరియుండుట కూడ తెలుప బడినది. బలవంతమగు సమీపరాజ్యముతో మైత్రిని పాటించుట జూడారాజ్యమునకు లాభకరమై మరికొంత కాలము వరకును దాని యునికికి కారణమయ్యెను. అస్సీరియా రాజ్యము వారి సహాయము కోరవలదని హితచింతకులు జూడా రాజగు అహాజ్‌నకు బోధించిరి. కాని దానివలన ఫలితము లేదయ్యెను. జూడా రాష్ట్రము అస్సీరియాకు సామంతరాజ్యమైన తర్వాత యూదురాజులు పరరాష్ట్రములతో నెట్టి సంబంధములును కల్పించుకొనకుండ మెలగుటయే క్షేమకరమని వారు తెలిసికొనిరి. యూదులు జూడా రాజ్యపు ప్రభువుల యెడల నెక్కుడు భక్తి విశ్వాసముల చూపుచుండెడివారు. ఆ రాజులు సుప్రసిద్ధులగు డేవిడ్ సాలమన్ ప్రభువుల వంశము వారగుట దీనికొక బలవత్తర కారణము. సహకారము వలన జూడా రాజులు తమ రాజ్యమున చక్కని పరిపాలనము నెలకొల్ప గల్గిరి. కాని మత విషయములందు జూడా ప్రజలు కూడ ఇస్రాయిల్ రాష్ట్రవాసుల వలెనే ఫినీషియా మతమును, ఆచారములను అవలంబింప సాగిరి. అదృష్టవశమున జూడా ప్రభువులలో పలువురు సమర్థులును, ప్రజాహితతత్పరులు నగుట ఆ రాజ్యమునకు బలము చేకూర్చెను. క్రీ. పూ. 722 ప్రాంతమున జూడా రాష్ట్రమునకు ప్రభువైన హెజికియా అనువాడు వీరిలో నొకడు. ఈతడు సత్పరిపాలనమును ప్రతిష్ఠించి జాతి నభివృద్ధి పరచెను. యూదు మతమునకు భిన్న

మగు నాచారములను తొలగించెను. జూడా రాజ్యమువా రింతకు పూర్వము కోల్పోయిన ప్రాంతముల పెక్కింటి నాతడు జయించెను. కాని క్రీ. పూ. 712 సంవత్సరమున హెజికియా అవివేకియై అస్సీరియా రాజునకు శత్రువైన బాబిలోను రాజుతో సంధి చేసికొనెను. అందులకు కోపగించి సారగాన్ (అస్సీరియా ప్రభువు) జూడా రాజ్యముపై దండెత్తి వచ్చి, హెజికియా నోడించెను. జూడా రాజు గొప్పధనరాశి నాతనికి సమర్పించి ఆతని యాగ్రహమును శాంతింపజేసెను.

క్రీ. పూ. 705 వ సంవత్సరమున సారగాన్ రాజు మరణింపగా సెన్నాచరబ్ అను నాతడస్సీరియా రాజ్యమున కధిపతి యయ్యెను. ఈతడు గొప్పవీరుడు. కాని యీతని సామంతులలో పలువు రీతనిపై తిరుగుబాటు కావించిరి. వారిలో జూడా రాజ్యము కూడ చేరెను. క్రీ. పూ. 701 వ సంవత్సరమున సెన్నాచరిబ్ జూడా రాజ్యమును జయించుటకై బయలువెడలి మొదట ఫినీషియా రాజ్యమువారి నోడించి, ఆపైన ఈజిప్టు వారికి గర్వభంగము కావించెను. అంత నాతడు జూడా రాష్ట్రమును వశపరచుకొనుటకు నిశ్చయించి, ఒక రాయబార వర్గమును పంపి జెరూసలేమ్ నగరమును తనకు స్వాధీనపరచవలసిన దని యాజ్ఞాపించెను. హెజికియా భయపడి ఇందుల కంగీకరించుటకు సంసిద్ధుడయ్యెను. కాని ఆనాటికి సజీవుడైయున్న ఇసాయా అను ప్రసిద్ధ మతగురు విందులకు సమ్మతింపక జెరూసలేమ్ నగ

రము క్రూరులగు పరరాజులకు వశపడదనియు, ఆ పట్టణమును బలవంతముగ స్వాధీన పరచుకొనుటకై ప్రయత్నించు వారికి పరాభవము తప్పదనియు సందేశ మంపెను. ఇసాయా పల్కిన పల్కుల యందలి ప్రతి యక్షరమును నిజమయ్యెను. ఈజిప్టు దేశపు సరిహద్దులలో విజయమును సాధించి విడిసియున్న అస్సీరియా సేనలపై పరమేశ్వరు డొక మహామారిని పంపెను. దీనివలన నాసైన్యమునం దసంఖ్యాకులు వీరులు మరణించిరి. ఈ యుపద్రవమును గాంచి భయపడి సెన్నాచరబ్ హతశేష మగు సేనల మరలించుకొని స్వదేశమునకు మరలి పోవుటయే గాక తన జీవితకాలమునందు మరెన్నడును జూడా రాజ్యము జోలికి పోలేదు. హెజికియా యనంతరము మెనాసీ అను రాజు జూడాను పాలించెను. ఈత డేబదిసంవత్సరముల కాలము రాజుగ నుండెను. కాని ప్రథమ దశయం దీత డవివేకియై వర్తించి, అస్సీరియాతో వైరము తెచ్చుకొని అసుర్ హాడన్ అను అస్సీరియా రాజుచే బందీగ చిక్కెను. కాని బంధవిమోచనము చెందిన వెనుక నీతడు సక్రమముగ పరిపాలనము సల్పెను. ఈతని యనంతరము రాజ్యపాలనము కావించిన వారిలో జోసయా అను రాజు ప్రముఖుడు. (క్రీ. పూ. 640) రాజ్య విస్తరణము గావించుటయే కాక, సత్యమగు యూదు మతమును పునరుద్ధరించుటకై ఈతడు మిక్కిలి పాటుపడెను. ఈతనికి హితచింతకులలో జెరిమియా అను ప్రసిద్ధవ్యక్తి యొకడు. జూడా రాజ్యము అభివృద్ధి

చేయుట కస్సీరియా రాజ్యము యొక్క పతనోన్ముఖత కూడ ముఖ్య కారణము. సిథియనులను అనాగరకప్రజ లస్సీరియాపై దండెత్తివచ్చి రాజ్యమును కూకటి వ్రేళ్ళతో కదల్చి వైచిరి. ఇదే యదనుగ గైకొని నీకో అను ఈజిప్టు రాజు అస్సీరియాపై దండెత్తి వచ్చెను. ఆతడు పాలస్తీనము గుండా పోవు సందర్భమున జూడా రాజాతని నెదిర్చి ఓడిపోయెను. ఈ పరాజయము వలన జూడా రాష్ట్రము నీకో రాజునకు సామంత రాజ్యముగ నుండుట కంగీకరింపవలసి వచ్చెను.

## బాబిలోనియాయందు ప్రవాసదుఃఖము

కాని ఈజిప్టు రాజైన నీకో అధికార మాసియా ఖండమున చిరకాలము సాగలేదు. క్రీ. పూ. 608 వ సంవత్సరమున మీడు జాతివారు అస్సీరియా రాజధాని యగు నినేవా నగరమును ధ్వంసము చేసి వశపరచు కొనుటతో సుప్రసిద్ధమగు నా సామ్రాజ్యము నశించెను. అందుత్తర భాగమును మీడు జాతి వారును, దక్షిణప్రాంతమును బాబిలోనియా రాజ్యము వారును వశపరచుకొనిరి. బాబిలోనియా రాజగు నెబుచడ్నెజారు అను నాతడు నీకో ప్రభువుతో కయ్యము పెట్టుకొని, ఆతనిని సంపూర్ణముగ పరాభవించి ఆసియా ఖండమునుండి తరిమివైచెను. ఈ కారణమున జూడా రాజ్యముపై అధికారము బాబిలోనియా వారికి సంక్రమించెను.

అనతికాలములోనే బాబిలోనియా ప్రభువులకును, జూడా రాజ్యమునకును వైరము కల్గెను. నెబుచద్నెజారు రాజు జూడా రాజ్యమును సంపూర్ణముగ జయించి, రాజును చెరపట్టుటయే కాక, యూదు ప్రజలలో పదివేలమందిని ఖైదీలుగ నిర్బంధించి తన రాజ్యమునకు గొనిపోయెను. ఈ విధముగ చెరపోయిన యూదులలో పలువురు లోహకారులు, ఇతరులైన పనివాండ్రు నుండిరి. ఇక జూడా రాష్ట్రమున మిగిలినవారు అసమర్థులును, పేదలు నగు సామాన్యజనులు.

జూడా రాష్ట్రము నెడ క్రౌర్యమును వహించుట కిష్టము లేక నెబుచద్నెజారు రాజు క్రీ. పూ. 597 వ సంవత్సరమున యూదు రాజ వంశమునకు చెందిన జెడీకియా అను నాతని యూదులకు రాజుగ నియమించెను. కాని ఈతడు మిక్కిలి అవివేకముతో ఈజిప్టు రాజులతో నేకమై బాబిలోనియాకు విరుద్ధముగ కుట్రలు చేయసాగెను. ఈ విషయము తెలియ వచ్చు సరికి నెబుచద్నెజారు రాజు మిక్కిలి ఆగ్రహమునకు లోనై మరల జెరూసలేమ్ పట్టణముపై దండెత్తెను. రెండు సంవత్సరముల కాలము ముట్టడి సాగెను. ఈ కాలమునందు యూదు ప్రజలు చాల కష్టములకు లోనైరి. తుదకు రాజగు జెడీకియా రహస్యముగ కోటనుండి పారిపోయెను. కాని బాబిలోనియా సైనికు లాతనిని చెరపట్టి తమ రాజునొద్దకు గొనివచ్చిరి. నెబుచద్నెజారు మిక్కిలి క్రూరముగ జెడీకియా కుమారుల నాతని ముంగటనే చంపించి, ఆతని కండ్లు పొడి

పించి వైచెను. (క్రీ॥ పూ॥ 588) ఈ విధముగ జూడా రాజు లిరువురు బాబిలోనియా రాజ్యమున బందీలుగ నివసింపవలసివచ్చెను.

అస్సీరియా రాజైన సారగాన్ ఇస్రాయిల్ రాష్ట్రము నందలి యూదుల నీ విధముగనే చెరపట్టి తన దేశమునకు గొనిపోయి నట్లు మనము తెలిసికొని యున్నాము. ఆ రాజు బందీల నొక ప్రదేశమున నుండనీయక వివిధ ప్రాంతములకు వారిని పంపివైచెను. కాని నెబుచడ్నెజారు రాజట్లు కాక యూదుల నందరను బాబిలోనియా పట్టణపు పరిసరములందే నివసించుట కనుమతి యొసంగెను. వీరి కాత డెట్టి కష్టములను కలుగ జేయక తన ప్రజలతో పాటు సమముగ పరిగణించి రక్షించెను. యూదులకు మతవిషయములందు సైతము స్వాతంత్ర్య మొసంగ బడెను. కావుననే వీరిలో కొందరు బాబిలోనియా రాజ్యపతనము తరువాత కూడ నైచ్ఛికముగ ఆ దేశముననే స్థిరనివాస మేర్పరచు కొనిరి. కాని స్వదేశాభిమానము హెచ్చుగ గల మరికొందరు యూదులు తమ దేశమును నిరంతరము తలంచుకొనుచు నిర్బంధ ప్రవాస దుఃఖము నతి కష్టముతో భరింప సాగిరి. పర్వతమయమైన పాలస్తీనమునందు నివసించిన వారికి, నిమ్నోన్నతములు లేని బాబిలోనియా మైదానములును, అచ్చటి పంటకాలువలును, ఉత్సాహము కల్గింపజాల వయ్యెను. తమ దుఃఖమును, మనోవ్యథను వర్ణించుచు యూదుకవులు వ్రాసిన ప్రవాస గీతములు వారి వాఙ్మయమునం దుత్తమ స్థానము నలంక

రించుచున్నవి. "మమ్ము బందీలుగ గొనివచ్చి శత్రువులు మమ్మొక నూతనదేశమున, నొక విచిత్ర వాతావరణమున ప్రతిష్ఠించి యున్నారు. నిరుత్సాహులమై మేము మా వీణలను చెట్ల కొమ్మలకు తగిలించి మౌనముద్ర వహించితిమి. దుఃఖితులమైన మమ్ము వారు సంతోషముగ నుండుడని నిర్బంధించుచున్నారు. శ్రావ్యములైన మా ప్రార్థనాగీతముల గానము చేయుమని వేధించుచున్నారు. కాని దుఃఖప్రపూర్ణమైన మానసముతో, విదేశమధ్యమున నా దివ్యగానమును సృష్టించుటెట్లు సాధ్యపడును!" అని వారు వాపోయిరి. ప్రవాసితులగు యూదులలో డేనియల్ అను ప్రసిద్ధ పురుషు డొకడుండెను. బాబిలోనియా ప్రభుత్వ మీతనిని, ఈతని మిత్రులు పలువురను విద్యాబుద్ధుల చెప్పించి గొప్ప పదవులలో నియమించెను. మత విషయములలో బాబిలోనియా వారికిని, ఈ యూదులకును వివాదములు సంభవించినను మొత్తము మీద డేనియల్ ప్రభృతులను బాబిలోనియా ప్రభువులు మిక్కిలి గౌరవించెడివారు.

యూదుల ప్రవాసకాలము డెబ్బది సంవత్సరములు మాత్ర ముండునని వారి ప్రవక్తలు తెల్పిరి. కాలపరివర్తనము వలన యూదులు స్వరాష్ట్రమునకు మరలి వచ్చుటయు, బాబిలోనియా రాజ్యము నేలపాలగుటయు సంభవించునని వారు జోస్యము చెప్పియుండిరి. ఆ సుదిన మెన్నడు వచ్చునా యని యూదు దేశభక్తు లుత్కంఠతో నెదురు చూడ సాగిరి.

తుదకా సమయ మాసన్నమయ్యెను. పారసీక రాజైన సైరస్ అను వాడు బాబిలోనియాపై దండెత్తి వచ్చెను. విశేష శ్రమ లేకుండగనే ఆతడు బాబిలోనియా నగరము నాక్రమింప గల్గెను. అచ్చట నివసించుచున్న యూదులు శత్రు రాజునకు కావించిన సహాయనే కొంతవరకీ విజయమునకు కారణమై యుండనోపును. యూదులు తనకు గావించిన సహాయమునకు కృతజ్ఞతా సూచకముగనో, లేక రాజనీతి యని భావించియో సైరస్ రాజు తాను బాబిలోనియా రాజ్యమును వశపరచు కొనిన తరువాత ఒక సంవత్సరములో యూదు స్వాతంత్ర్య మును ప్రకటించెను. బాబిలోను పట్టణమును వీడి తమ స్వదే శమునకు పోదలంచిన యూదులు యథేచ్ఛగ నట్లు కావింప వచ్చునని యాతడు సెల వొసంగెను. ఈ సదవకాశమును పురస్కరించుకొని పలువురు యూదులు మరల పాలస్తీనము నకు బయలు వెడలిరి. అట్టి వారికి సైరస్ రాజు సర్వవిధముల సహాయము కావించి వారి దేవాలయమును పునర్నిర్మాణము కావించుటకు ధనసహాయము చేసెను. ప్రాచీన దేవాలయమునకు సంబంధించిన కొన్ని స్వర్ణపాత్రలు మున్నగునవి బాబిలోనియా రాజ్యమున నున్నవాని నా రాజు యూదులకు తిరిగియిచ్చెను. బాబిలోనియా యందే స్థిరనివాసముగ నుండ నిశ్చయించిన యూదులు తమ స్వజాతీయులకు విరివిగ ధన సహాయము కావించిరి. ఈ సందర్భమున పాలస్తీనమునకు మరలి వచ్చిన యూదులసంఖ్య సుమారు రెండులక్షలవరకుండ వచ్చునని

అంచనా వేయబడినది. వారికి డేనియల్ వంశస్థుడైన జెరుబ్‌బాబెల్ అను నాతడు నాయకత్వము వహించెను.

## యూదులుస్వరాష్ట్రమునకుమరలివచ్చుట

అనేక కష్టముల ననుభవించి యూదులు స్వరాష్ట్రమునకు మరలివచ్చిరి. అనతి కాలములోనే వారు తమ సుప్రసిద్ధ దేవాలయమును పునర్నిర్మాణము కావించుటకు పూనుకొనిరి. కాని యీ ఘనకార్యము చాల కాలమువరకును పూర్తి కాలేదు. జెరూసలేమ్ నగరమునకు సమీపమందున్న తెగలవారు పలువురీ దేవాలయ నిర్మాణమునందు పాల్గొనవలయునని యుత్సాహము చూపిరి. కాని వారు మతాంతరులైన కారణమున యూదులు వారిని నిరసనభావముతో పరిగణించి,దరికి చేరనీయరైరి. ఆ కారణమున వారుయూదులతో శత్రుత్వము బూని వారి నిర్మాణకార్యమున కవరోధములుకల్పించజొచ్చిరి. కావున దేవాలయము కొన్ని సంవత్సరములవరకును పూర్తికాలేదు. క్రీ॥ పూ॥ 521వ సంవత్సరమున పారసీక రాజ్యమునకు ప్రభువైన డెరయస్ తన పూర్వీకుడైన సైరస్ యూదులను గూర్చి కావించిన ప్రకటనను బలపరచి, యూదు దేవాలయ నిర్మాణమునకు కావలసిన సహాయమును చేయవలసినదని యాజ్ఞాపించెను. తత్ఫలితముగ జెరూసలేమ్ దేవాలయము చురుకుగ సాగిపోయి క్రీ॥ పూ॥ 515వ సంవత్సరమున సంపూర్ణ

మయ్యెను. సుప్రసిద్ధమైన ఈ దేవాలయము నిర్మించుటకిది రెండవ పర్యాయము. దేవాలయ పునరుద్ధారణమును గూర్చిన ప్రశంస బైబిలుగ్రంథమందలి కొన్ని ప్రార్థనా గీతములలో కావింపబడినది.

క్రీస్తు పూర్వ మైదవశతాబ్ది ప్రారంభమున పారసీక సామ్రాజ్యమునకును గ్రీకులకును యుద్ధములు ప్రారంభమై అందు పారసీకు లోడిపోయిరి. దీనివలన నా సామ్రాజ్యము బలహీనము కాజొచ్చెను. క్రీ॥ పూ॥ 465వ సంవత్సరమున మొదటి ఆర్టాజర్జెస్ అను రాజు పారసీకరాజ్యమున కేలిక యయ్యెను. ఈతడు యూదుల యెడ మిక్కిలి సద్భావము కలవాడు. ఈ రాజు ఎజ్రా అను వానిని జూడా రాష్ట్రమునకు పాలకునిగ నియమించెను. ఈ ఎజ్రా స్వయముగ మతగురువుల వంశములోనివాడు. మిక్కిలి మతాభినివేశము గలవాడు. కావున నాతడు తనతోపాటు పలువురు పురోహితులను, లెవైటు తెగవారిని, వెంటబెట్టుకొని దేవాలయ కైంకర్యము నకై అపారధనమును సేకరించి జెరూసలేమ్ నగరమున కేతెంచెను. కాని అచ్చటి పరిస్థితులు గమనించు సరి కాతని కాశ్చర్యము కల్గెను. యూదులు పలువురు దేవాలయనిర్మాణ ముతో తమ విధ్యుక్తధర్మము పూర్తియైనట్లు తలంచి, మత ధర్మములను విస్మరించి, తత్ప్రాంతములలో నివసించు ప్రజలతో నంతర్వివాహములు కావించుకొనుచు కాలము పుచ్చుచుండిరి. ఎజ్రా మతవిషయమున కఠినమైన కట్టుబాట్లను చేసి, యూదు

లెవ్వరును మతాంతరుల వివాహ మాడరాదని నిషేధించెను. ఈ కాలమునుండియే యూదులలో అన్యసంపర్కము నెడ నసహ్యతయు, తమ జాతి పవిత్రతను సంరక్షించుకొనవలెనను పట్టుదలయు హెచ్చెను. క్రీ. పూ. 445 వ సంవత్సరమున నెహీమియా అను నాతనిని పారసీకరాజు జూడా రాష్ట్రమునకు పాలకునిగ నియమించి, జెరూసలేమ్ నగరమును బాగుచేసి కోటగోడలను పునర్నిర్మాణము కావింపవలెనని యాజ్ఞాపించెను. ఈ యాజ్ఞకు కారణము కేవలము యూదుల యెడ పారసీక ప్రభువులకు గల దయ మాత్రమేకాదు. తమ బలము క్రమక్రమముగ క్షీణించుచుండుట గుర్తించి, సమీప మండలి ప్రజలను తమ పక్షమునకు త్రిప్పికొను నుద్దేశ్యముతోడను, అవసరమైనప్పుడు జెరూసలేమ్ వంటి బలవత్తరమగు దుర్గము తమ యధీనమం దుండుటకును వారట్లు కావించియుందురు. ఏది యెట్లయినను యూదుల కీ సహాయత యెంతయో సంతసమును కల్గించెను. వారు పారసీక ప్రభువులయెడ చిరకాలము వరకును కృతజ్ఞులై యుండిరి. జెరూసలేమ్ దుర్గమును బలపరచుటలో అనేక కష్టములు సంభవించెను. కాని వాని నన్నిటిని జయించి ఆతడు తన కార్యమును సాధించెను. క్రీ. పూ. 433 వ సంవత్సరమున పారసీక రాజీతని సమర్థతను గుర్తించి మరి యొక పర్యాయ మీతనిని జూడా రాష్ట్రమునకు పాలకునిగ నియమించెను.

క్రీ. పూ. 432 వ సంవత్సరమున యూదు మతమున నొక అంతశ్శాఖ యేర్పడెను. యూదులలో కొందరు సమారిటను స్త్రీలను వివాహము చేసికొనిరి. దీనిని యూదుసంఘము నిషేధించెను. అంతట వీరు తమ ప్రాచీన మతసంప్రదాయముల విడనాడి గెరిజిమ్ పర్వతముపై వేరొక దేవాలయమును నిర్మించుకొని ప్రత్యేకశాఖగ నెగడజొచ్చిరి. యూదులకును వీరికని సంబంధములు విచ్ఛిన్న మయ్యెను. పైన తెలుపబడిన యంశములు సంభవించిన తరువాత సుమారు ఒక శతాబ్ది వరకును జూడా రాష్ట్రమునందు గణింపదగిన విశేషము లేవియు జరుగలేదు. క్రీ. పూ. 334 వ సంవత్సరమున జగదేక వీరుడగు అలెగ్జాండరు రాజు పారసీక సామ్రాజ్యముపై దండెత్తి వచ్చెను. యూదులు పారసీక రాజులయెడ భక్తి విశ్వాసములతో ప్రవర్తించుచుండుటవలన నాతని కాగ్రహము కల్గి జెరూసలేమ్ పట్టణముపై నాతడు తన సేనల నడపెను. కాని దేవాలయ పురోహితముఖ్యుడీ యవనవీరుని సందర్శించి సంధి వాక్యములచే నాతనిని ప్రసన్నుని కావించుకొనెను. క్రీ. పూ. 323 వ సంవత్సరమున నలెగ్జాండరు రాజు మరణించెను. అంతట నాతని సేనానులలో నొకడగు టాలమీ యను నాతడు జెరూసలేమ్‌ను ఆక్రమించెను. టాలమీ ఈజిప్టు రాజ్యమునకు ప్రభువుగ నుండెను. అతడు యూదుల యెడ మిక్కిలి స్నేహభావమును చూపి పలువురను తన రాజ్యమునకు రావలసినదిగా ఆహ్వానించెను. అందుల కంగీకరించి

ఈజిప్టునకు వలసపోయిన యూదులు టాలమీల అధికారమున కొంతకాలము వరకును సుఖముగ కాలక్షేపము చేయసాగిరి. జూడారాష్ట్ర మొకప్పు డీజిప్టు రాజులకును, మరొకప్పుడు సిరియారాజ్యమందలి గ్రీకు ప్రభువులకును వశముకాజొచ్చెను. కాని అధికార మెవ్వరి దైనను, జూడా రాష్ట్రమున కాంతరంగిక పరిపాలన మందు సర్వస్వాతంత్ర్య మొసంగబడెను. ఇట్లు ఒకటిన్నర శతాబ్దము గడచెను.

క్రీ. పూ. 126 వ సంవత్సరమున ఆంటియోకస్ అను వాడు సిరియా యందలి గ్రీకురాజ్యమున కధిపతి యయ్యెను. ఈతడు నీతినియమములు లేని ధూ [illegible] రణమువలననో ఆతనికి యూదులపై ఆగ్రహ [illegible] శిక్షింపవలెనని నిశ్చయించెను. అంత నా [illegible] రము నాక్రమించి అందలి ప్రజల [illegible] ఆతని కోపము తీర లేదు. ఆ [illegible] పై దా [illegible]

దేవస్థానములు నెలకొల్పబడెను. ఆ దేవతలను పూజించుటకు నిరాకరించిన వారు మహాకూరముగ శిక్షింపబడిరి. అనేకులు యూదులు తమ మతధర్మములకై ప్రాణముల ధారపోసిరి. ఆంటియోకస్ కొందరకు ధనాశ జూపియు, మరికొందరిను బెదరించియు యూదు మతమును విడనాడునట్లు చేసెను. కాని అధికసంఖ్యాకులగు యూదులీ దౌర్జన్యమునకు లొంగిపోక తమ హక్కులను సంరక్షించుకొనుటకు కృత నిశ్చయులైరి.

## యూ[illegible]మును సంరక్షించిన
## [illegible]కాబిస్

ఆ[illegible]ంచిన యుద్ధమము జయ
ప్రద[illegible]రూసలేమ్ నగరమున
[illegible] న[illegible]ంచుటకు

నొసంగిరి. ఆ కాలమున మోడిన్ అను గ్రామమున మట్టాథియాస్ అను వృద్ధపురోహితు డొకడు జీవించియుండెను. ఆతనికి సంప్రాప్త వయస్కులైన ఐదుగురు కుమారులుండిరి. వీరు మోజెస్ ప్రవక్త సోదరుడైన ఆరన్ తమ వంశమునకు మూల పురుషుడని తలంచుచుండిరి. ఆంటియోకస్ రాజుచే నియమింపబడిన ఒక ఉద్యోగి మోడిన్ గ్రామమున కేతెంచి మట్టాథియాస్‌నకు ధనాశ చూపి యూదుమతమును విడనాడు నట్లు నిర్బంధింప సాగెను. ఆ గ్రామమున గ్రీకు సంప్రదాయము ననుసరించి బలివేదికలు నిర్మింపబడెను. మట్టాథియాస్ తన మత ధర్మములందు మిక్కిలి పట్టుదల గలవాడు. యూదు మత విరుద్ధముగ ప్రార్థనాదికములు జరపి, బలి నొసంగిన మొదటి యూదు నాతడు తన ఖడ్గముతో సంహరించెను. మరుసటి క్షణమున రాజోద్యోగికికూడ నీ గతియే పట్టెను. తక్షణమే మట్టాథియాస్‌ను ఆతని కుమారులును, గ్రీకు మతచిహ్నములను తమ గ్రామమునుండి సంపూర్ణముగ తుడిచివైచి, ఆత్మరక్షణమునకై సమీపమందలి పర్వతముల లోనికి పారిపోయిరి. అనేకులు యూదులు వారి పక్షము నవలంబించిరి. మట్టాథియాస్ కుమారు లందరునుకూడ సమర్థులే. కాని వారిలో మూడవవాడైన జూడాస్ అను నాతడు సమర్థతముడు. గ్రీకు రాజుపై యూదులు కావించిన తిరుగుబాటున కీతడు నాయకత్వము వహించెను. వీరులును దృఢనిశ్చయులు నగు యూదు వీరులు పలువురీ ప్రయత్నమును బలపరచిరి.

ఈ జాతీయోద్యమము నణచివేయుటకై గ్రీకులు నిశ్చయించిరి. సమేరియాకు రాజప్రతినిధిగానున్న అపొలోనియస్ అను గ్రీకు అధికారి కొందరు స్థానికులను సమకూర్చుకొని యూదుల తిరుగుబాటు నణచివేయుటకై యత్నించెను. కాని ఈ ప్రయత్నమునందితడే ప్రాణముల గోల్పోయెను. క్రీ. పూ. 166వ సంవత్సరమున గ్రీకులు మరియొక ప్రయత్నము కావించిరి. కాని వారికి విజయము లభింపలేదు. తుదకు ఆంటియోకస్ రాజునకు ప్రతినిధియైన లిసియాస్ 50,000 సైనికులతో యూదుల విప్లవము నణచివేయుటకై సమకట్టెను కాని జూడాస్ మెకాబిస్ సమర్థతవలనను, చాకచక్యము వలనను మరల యూదులే జయమును సాధించిరి. నిరంతర పరాజయముల వలన విసువుచెంది లిసియాస్ పాలస్తీనమును వీడి వెడలిపోయెను. ఇదే యదనని తలంచి క్రీ. పూ. 165 వ సంవత్సరమున జూడాస్ జెరూసలేమ్ నగరము నాక్రమించి, పరిసర ప్రదేశములను జయించెను. కాని ఆంటియోకస్ నిర్మించిన మిల్లో యను దుర్గమును మాత్రము సాధింపజాలడయ్యెను. జూడాస్ ప్రసిద్ధమైన యూదు దేవాలయమును పునరుద్ధరించి, అందు పూజాదికముల ప్రారంభింప జేసెను. దూరప్రాంతములందు నివసించు గ్రీకుల దౌర్జన్యములకు గురియగుచున్న యూదులకు వీలయినంత సహాయమును కావించుటకై జూడాస్ సర్వవిధముల యత్నించెను.

క్రీ. పూ. 164 వ సంవత్సరమున ఆంటియోకస్ రాజు

మరణించెను. ఆతని జ్యేష్ఠపుత్రుడగు డెమిట్రియస్ అనువాడు రోమునగరమున బందీగ నుండిన కారణమున రెండవ కుమారుడగు ఆంటియోకస్ రాజ్యాధికారము పూనెను. ఈ రాజు కాలమున గ్రీకులు యూదుల నణచివేయుటకై తీవ్రమైన ప్రయత్నములు చేసెను. కాని అవి ఫలకారులు కాలేదు. తదుపరి గ్రీకులకును యూదులకును సంధి కుదిరెను. యూదులకు మతవిషయిక స్వాతంత్ర్య మొసంగుటకు గ్రీకు లంగీకరించిరి. కాని రోము నగరమున బందీగనున్న డెమిట్రియస్ అను రాకుమారుడు చెరనుండి తప్పించుకొని, సిరియా దేశమునకు పారివచ్చి, తన సోదరుడగు ఆంటియోకస్‌ను చంపి రాజ్యమున కధికారి యయ్యెను. ఈతడు యూదులయెడ వైరము పూని యుద్ధము ప్రకటించెను. సిరియావంటి బలవత్తరమైన రాజ్యముతో యుద్ధముచేయుట సాధ్యముకాదని తెలిసికొని జూడాస్ రోము నగరమునకు తన రాయబారులను పంపి సహాయము కావింప వలసినదని రోమను ప్రభుత్వము వారిని కోరెను. వారందులకు సంతోషపూర్వకముగ నంగీకరించిరి. కాని రాయబారులు పాలస్తీనమునకు మరలివచ్చుటకు పూర్వమే డెమిట్రియస్ రాజు తన సేనలను జూడాస్‌తో పోరుటకై పంపెను. క్రీ. పూ. 160 వ సంవత్సరమున సంభవించిన యుద్ధమున జూడాస్ ప్రాణముల గోల్పోయెను.

జూడాస్ మెకాబిస్ యూదు జాతీయ వీరాగ్రణులలో నొకడని వేరుగ తెలుపనక్కరలేదు. గ్రీకులతో సంభవించిన

యుద్ధములలో నాతడు ప్రాణముల గోల్పోయినను ఆతడు సాధించిన విజయములు మాత్రము నిరర్థకము కాలేదు. జాతీయ స్వాతంత్ర్యము కొరకై యూదులు చాలకాలము వరకును తమ ప్రతిపక్షులతో పోరాడుచునే యుండిరి. కాని మతవిషయములందు మాత్రము వారికెట్టి కష్టములును కలుగ లేదు. ఆ విషయమై యూదులతో కావించుకొనిన ఒడం బడికను గ్రీకులు మన్నించిరి.

## యూదు రాజ్యము క్షీణించుట

జూడాస్ మరణానంతర మాతని సోదరులు యూదు జాతికి నాయకత్వము వహించిరి. వీరిలో జొనాధన్ అను వాడు పదునెనిమిది సంవత్సరములు నాయకుడుగ నుండెను. ఈతడు మిక్కిలి సమర్థుడైన రాజనీతిజ్ఞుడు. సిరియా రాజ్యమునకై ఇరువురు హక్కుదారు లొండొరులతో కలహించు చుండి నందున జొనాధన్ దాని నదనుగా గైకొని తన బలము నభి వృద్ధి పరచుకొనెను. జొనాధన్ మరణించిన వెనుక ఆతని జ్యేష్ఠ సోదరుడు సైమన్ యూదులకు నాయకుడయ్యెను. క్రీ. పూ. 143 ఈతడు మిక్కిలి దూరదృష్టి గలవాడు. పరిపాలనమందు సమర్థత గలవాడు. సైమన్ తన సోదరులు సంపాదించిన యధికారమును ద్విగుణీకృతి మొనర్చెను. తన రాజ్యపు సరిహద్దుల యందున్న దుర్గముల నీతడు బలపరచెను. జెరూసలేమ్ పట్టణమునకు

సమీపమున నెలకొల్పబడిన మిల్లో దుర్గమును వశపరుచుకొనెను. రోము ప్రభుత్వము వారితో నీతడు మరల సంధి కావించుకొనెను. ఈ కారణమున రోమను సెనేటు సభవారు తాము యూదుల సంరక్షణమునకు పూనుకొన్నట్లు ప్రకటించి, ఆ ప్రకటనను తమ విశాల సామ్రాజ్యమం దెల్లెడల తెలుపుడు కావించిరి. (క్రీ పూ. 141)

కొంతకాలము వరకును యూదు జాతి వా రించుమించు సంపూర్ణ స్వాతంత్ర్యము ననుభవించుచు, ఏ యితర రాజ్యమునకును సామంతులుగ నుండక కాలముగడపిరి. కాని క్రీ. పూ. 135 వ సంవత్సరమున యూదులకు నాయకుడగు సైమనును శత్రువులు వధించిరి. సిరియారాజ్యము మరల పాలస్తీనముపై సార్వభౌమత్వము వహించెను. కాని అనతికాలములో సిరియా రాజ్యమున నంతర్యుద్ధములు సంభవించుటచే పాలస్తీనము మరల తల యెత్తెను. సైమన్ కుమారుడగు జాన్ హిర్కానిస్ అనువాడు యూదులకు ప్రభువై ప్రాచీన కాలమునందు యూదుజాతివా రనుభవించిన ఉచ్చదశను మరల తేగల్గెను. అతడు యూదు రాజ్యమును మరల విస్తరింపజేసెను. కాని అంతఃకలహముల వలన నాతని రాజ్య ముచ్చదశను చెంద జాలక పోయెను. ప్రపంచమునం దన్ని దేశములలో వలెనే ఇచ్చట సైతము ప్రజలయందు కక్ష లేర్పడెను. యూదులలో కొందరు పవిత్రవాదులు. వీరు మతవిషయములందు మిక్కిలి పట్టుదల గలవారు. వీరిని "ఫారిసీ" లని వ్యవ

హరించెడి వారు. రెండవ పక్షమువారు చార్వాకులు. భౌతిక వాదులు. జీవితమునకు ముఖ్యాదర్శము సౌఖ్యానుభవమని వీరి వాదము. జూడాస్ మెకాబిస్‌ను, అతని వంశమువారును పవిత్రవాదులు. వీరు యూదుమత సంరక్షణము కొరకును జాతీయస్వాతంత్ర్యము కొరకును విశేషముగ కష్టించియుండిన కారణమున వీరియందు మతావేశము విశేషముగ నుండెను. కాని మతావేశము త్వరలో దంభాచారముగ పరివర్తన మొందుట కవకాశము కలదు. అదే విధముగ యూదులలో కూడ మతధర్మనిరతి అనతికాలములోనే దంభత్వముగ మారెను. మెకాబిస్ అనంతరము రాజ్యాధికారమును పూనినవారు భోగభాగ్యములలో నోలలాడుచు చూపులకు మతదీక్షా పరులుగ కానవచ్చుచుండిరి నందున వారి ధర్మపరాయణత నేతిబీరకాయగ మారెను. నేటి కాలమున "ఫారిసీ" అను పదమునకు ధర్మపరాయణునివలె నటించు బూటకపు వ్యక్తి యను భావము సంక్రమించినది. మెకాబిస్ వంశమువారు కొంత కాలము పవిత్రవాదుల పక్షము నవలంబించి, తుదకు క్రమముగ భౌతికవాదులుగ మారిరి. ఈ మార్పులు రాష్ట్రమునందు అంతర్యుద్ధమునకు దారి తీసెను. తుదకు క్రీ. పూ. 77 వ సంవత్సర ప్రాంతమున అరిస్టోబ్యూలస్, ఆంటిపేటర్ అను వార లధికారమును సంపాదించుటకై యొండొరులతో తీవ్రముగ కలహింపసాగిరి. ఈ అంతర్యుద్ధము నాపుటకై పాంపే యను రోమను సేనాని

పాలస్తీనముపై దాడి వెడలి జెరూసలేమ్ నగరము నాక్రమించెను. (క్రీ. పూ. 63) కాని ఆతడు యూదులను మిక్కిలి సానుభూతితో నవలక్షించి వారి దేవాలయములను కాపాడెను. పాంపే యూదురాజవంశీయుడగు హిర్కానిస్ అనువానిని రాజుగ ప్రతిష్ఠించి ఆతడు రోమను ప్రభుత్వముతో మైత్రిని నెరపునట్లు కట్టడిచేసెను. హిర్కానిస్ నామమాత్రమునకు రాజుగ నుండెను. రాజ్య సూత్రములు ఆంటిపేటర్ అను నాతని హస్తములయం దుండెను. ఈత డాశాపరుడు. క్రీ. పూ. 48 వ సంవత్సరమున రోమను రాజ్యమునందు సీజర్ పాంపేలకు అంతర్యుద్ధము సంభవించిన సందర్భమున ఆంటిపేటర్ మిక్కిలి చాకచక్యముతో వర్తించి తత్పూర్వుడకు సీజరుకు విజయము లభించునని యెరింగి ఆతని పక్షమును వహించెను. అలెగ్జాండ్రియా పట్టణమున సీజరు మిక్కిలి ప్రమాదావస్థయందున్నప్పుడు ఆంటిపేటర్ ఆతనికి చాల సహాయము కావించెను. మిత్రపక్షపాతియైన సీజరు ఆంటిపేటర్ కావించిన సహాయమును మరువక తన అధికారము బలపడగానే ఆంటిపేటర్‌ను జూడారాష్ట్రమునకు రాజకీయాధికారిగ నియమించెను. హిర్కానిస్ మతాధికారిగ నిలచియుండెను. ఆంటిపేటర్ మిక్కిలి సమర్థుడు. కావున నాతడు తన రాష్ట్రమం దేర్పడిన చిన్నచిన్న ప్రభుత్వములను రద్దుపరచి, సమీప ప్రాంతముల జయించి, జెరూసలేమ్ నగరమును, దుర్గమును బలపరచెను. ఈతనికి రోమను ప్రభుత్వముతో సఖ్యత యుండి

నందున జూడారాష్ట్ర) విప్పుడు సంపూర్ణముగ నీతని వశ మయ్యెను. ఆంటిపేటర్ తన మొదటి కుమారుని జెరూసలేమ్ పట్టణమునకు పాలకునిగ నియమించెను. రెండవ కుమారుడగు హీరాద్ అనువాడు గెలీలీ ప్రాంతమున కధికారిగ నియమితు డయ్యెను. హీరాద్ మిక్కిలి సమర్థుడు. రాజ్యాధి కారమును వహించుట కీతని కడ చక్కని యోగ్యత యుండెను. కాని పరిస్థితులు విపరీతముగ మారుటవలన నీతడు మిక్కిలి దుష్కీర్తిని గడించుట మనము చూడగలము. క్రీ. పూ. 43వ సంవత్సరమున ఆంటిపేటర్ చంపబడెను. అతని యనంతర మధికారమును గ్రహించుటకై హీరాద్ చాల ప్రయత్నము చేసెను. కాని యూదుప్రజ లాతనికి ప్రతికూలురై మెకాబిస్ వంశమువారైన ఆంటిగోనస్ అను రాజపుత్రునికి సహా యము కావించిరి. మార్గాంతరము లేక హీరాద్ రోము పట్టణమునకు పారిపోయి, అచ్చట రోమను నియంతయైన జూలియస్ సీజరునకు మిత్రుడైన ఆంటొనీ మైత్రిని సంపా దించెను. అనతికాలములో జూడా రాష్ట్రమున నంతర్యుద్ధ ములు ప్రారంభమగుట జూచి ఆంటొనీ తన మిత్రుడైన హీరాద్‌ను జూడా రాజ్యమునకు రాజుగ నియమించి, అచ్చ టికి పంపెను.



# హీరాద్ రాజు పరిపాలనము

ఈ రాజు పరిపాలనా కాలము పాలస్తీనపు చరిత్ర యందే కాక ప్రపంచచరిత్ర యందు కూడ మిక్కిలి ప్రాముఖ్యత వహించి యున్నది. ఈతడు సింహాసన మధిష్ఠించుటతో యూదుల స్వాతంత్ర్యము నశించినట్లు తెలుప వచ్చును. ఈతనికి పూర్వము రాజ్య మేలిన రాజులు రోమక ప్రభుత్వము వారితో మైత్రి నెరపి అనేకసమయము లందు వారి సహాయము ను పొందిరి. కాని వారెవ్వరును రోమక ప్రభుత్వమునకు సామంతులుగ నుండలేదు. హీరాద్ మాత్ర మట్లు కాక రోమక ప్రభుత్వము వారి సహాయము వలననే యూదులకు రాజు కా గల్గెను. ఈతడు మిక్కిలి సమర్థుడైన పరిపాలకుడనుటలో సందియ మెంత మాత్రమును లేదు. కాని యీతడు కావించిన క్రూరకృత్యము లీతని కెన్నటికిని మరపునకు రాని దుష్కీర్తిని కల్గించెను. హీరాద్ రాజు పరిపాలనము చేయుచున్నప్పుడు పాలస్తీన మందు మహాపురుషుడును, క్రైస్తవమత ప్రవక్తయు నగు యేసు క్రీస్తు జన్మించెను. హీరాద్ మరణించిన యనతికాలములో యూదుల నామమాత్ర స్వాతంత్ర్యము కూడ నశించి, వారు రోమక రాజ ప్రతినిధుల పరిపాలనము లోనికి వచ్చిరి.

హీరాద్ క్రీ. పూ. 37 వ సంవత్సరమున రాజ్య పరిపాలనము ప్రారంభించెను. తన బలము నభివృద్ధి పరచుకొనను నుద్దేశ్యముతో నీతడు గొప్ప యధికారములలో నున్న తన

ప్రతిపక్షులను చంపించి, వారి స్థానమున తన మిత్రులను నియమించెను. ఈతడు రాజకీయాధికారమును, మతాధికారమును ఐక్య పరచి, ఇంత వరకును ప్రత్యేకముగ నున్న మతాధికారి పదవిని రద్దు పరచెను. జూడాస్ మెకాబిస్ వంశము వారింకను పాలస్తీనమున పలువు రుండిరి. ప్రజా సామాన్యము, వారి యెడ మిక్కిలి అనురక్తులై యుండుట తనకు ప్రమాదకరమని హీరాద్ గుర్తించెను. కావున నాతడు మెకాబిస్ వంశమునకు చెందిన మరియం అను స్త్రీని వివాహము చేసికొని ఆమె వలన పురుషసంతానమును పొందెను. రాజనీతికుశలుడైన హీరాద్ ఆనాడు రోమక సామ్రాజ్యమున చెలరేగి యున్న అంతః కలహములలో పాల్గొనక ఏ పక్షమునకు జయము కల్గునా యని యెదురు చూచుచుండెను. తుదకు జూలియస్ సీజరునకు దత్త పుత్రుడైన ఆక్టేవియస్ సీజరు అను వాడు తన ప్రతిద్వంద్వుల నోడించి రోమక సామ్రాజ్యమునకు చక్రవర్తి యగుట తోడనే హీరాద్ అతని పక్షము నవలంబించెను. ఆగస్టస్ సీజరు హీరాద్ అధికారము నంగీకరించుటయే కాక, ఆతనికి సమీపమందలి యితర భూభాగములపై కూడ పరిపాలకత్వము నొసంగెను. హీరాద్ రాజు ప్రజాక్షేమమును గురించి యెన్నడును అశ్రద్ధవహింప లేదు. ఈ కాలమున పాలస్తీనమునందు కాటకము ప్రబలెను. అంతట హీరాద్ తన వద్ద నున్న ధనము నంతను బాధితులగు ప్రజల సౌఖ్యమునకై వెచ్చించి,

ఈజిప్టు దేశమునుండి ధాన్యమును దిగుమతి కావించి, ప్రజల రక్షించెను. ఈతడు సమేరియా అను పట్టణమును పునర్నిర్మాణము గావించుటయే కాక, సముద్రతీరమున సీజారియా అను సుందరనగరమును నెలకొల్పి, దాని ననేక దివ్యభవనములచే నలంకృతము కావించెను. యూదు ప్రజలను సంతోషపరచునిమిత్తమై యీతడు జెరూసలేమ్ నగరమందలి ప్రసిద్ధమగు దేవాలయమును పునర్నిర్మాణము చేయుటకై పూనుకొనెను. ఆ దేవాలయ మప్పటి కైదు శతాబ్దములకు పూర్వము నిర్మింపబడి యుండెను. అయినను ప్రజలకు తన సదుద్దేశ్యముల యెడ నెంత మాత్రమును అనుమానము లేకుండుటకై ఆతడు నూతనదేవాలయమును నిర్మించిన తరువాతనే పాతకట్టడమును తొలగించెను. దేవాలయ నిర్మాణమునకై అసంఖ్యాకమగు ధనము వెచ్చింపబడెను. చలువరాళ్ళతోడను, బంగారు పనితనముతోడను దేవళము చూపరుల కాశ్చర్యమును, ఆనందమును కొలుపసాగెను. అయినను యూదు ప్రజల కీతని యెడ అభిమానము కుదురదయ్యెను. హీరాద్ తమ మతమునకు శత్రువని యూదులు తలంపసాగిరి. వారిలో కొందరు తమ రాజునకు విరుద్ధముగ కుట్రలు పన్ని ఆతనిని చంపుటకై యత్నించిరి. హీరాద్ ఈదుష్ప్రయత్నముల తెలిసికొని కుట్రదారులలో నాయకులను చంపించెను. దేవాలయమునకు సమీపమున నాతడొక కోటను కట్టించి, ప్రజలలో నెట్టి తిరుగుబాటులు సంభవించినను వాని నణచి

వేయుటకై కోటను తనకు స్థావరముగ కావించుకొనెను.

పైన తెల్పినవిధమున హీరాద్ రాజు నందనేక సద్గుణములుండెను. కాని దురదృష్టవశమున నాతని సాంసారిక జీవితము విషపూరితమైన కారణమున, నాతని సౌఖ్యము భగ్నమై, తత్ఫలితముగ నాతడు మిక్కిలి క్రూరునివలె వర్తించెను. ఈతని సోదరియగు సెలోమ్ అను నామె మిక్కిలి అవినీతిపరురాలు. రుధిరప్రియ. క్రూరురాలు. దురదృష్టవశమున హీరాద్ ఆమె చెప్పుచేతలలో నుండి ఆమె యాడించినట్లాడుచుండెడివాడు. హీరాద్, మెకాబిస్ వంశమునకు చెందిన మరియం అను స్త్రీని వివాహము చేసికొన్నట్లు తెల్పియున్నాము. ఆమె మిక్కిలి యోగ్యురాలు. రాజామెయందు మిక్కిలి అనురక్తుడై యుండెను. కాని సెలోమ్ దురోధల వలన రాజామెపై కోపగించి ఆమెను చంపించెను. ఆ నాటి నుండియు హీరాద్ మతిలేని వానివలె వర్తింప సాగెను. క్రూరురాలగు సెలోమ్ రక్తపిపాస కంతము లేకుండెను. అన్యాయముగ వధింపబడిన మరియంరాణికిరువురుకుమారు లుండిరి. తమ తల్లిని చంపించినందులకై తనపై వారెన్నటికైన పగతీర్చుకొనక మానరని యెరింగి సెలోమ్, హీరాద్ ప్రథమ భార్యయగు డోరిస్ అను నామె కుమారుడగు ఆంటిపేటరుతో కలిసి కుట్రలు సల్పి, రాజునకు మరియం కుమారులపై ప్రబల ద్వేషము కల్గించి వారికి మరణశిక్ష విధింపించెను. (క్రీ. పూ 5) ఈ కుమారుల యెడ రాజునకు మిక్కిలి ప్రేమ. మరణ దండన విధింపబడిన అనతికాలములో వారు నిరపరాధులని

హీరాద్‌నకు తెలియవచ్చెను. అప్పు డాతనికి కల్గిన దుఃఖము వర్ణనాతీతమని వేరుగ తెల్పనక్కరలేదు. మరికొంత కాలము నకు తన ప్రథమ పుత్రుడైన ఆంటిపేటర్ తనకు విష ప్రయో గము కావించుటకై యత్నించినట్లు తెలిసికొని హీరాద్ ఆతనిని కూడ చంపించెను. ఇంచుమించు ఇదే సమయమున హీరాద్ రాజు బెత్లిహేమ్ అను చిన్న పట్టణమునందు రెండు సంవత్సరముల లోపు వయస్సు గల బాలుర నందరను చంపించి ఘోరమగు దుష్కీర్తి పాలయ్యెను. నిరపరాధులగు పసిబాలుర హత్యను గూర్చిన వృత్తాంతమును మన మించుక విపులముగ తెలిసికొనవలసి యున్నది.

# ఏసు క్రీస్తు జననము

ఆధునిక యుగము మిక్కిలి హీనదశయందున్నదనియు, ప్రాచీనకాలమున స్వర్ణయుగము ప్రబలి యుండెననియు, భవి ష్యత్కాలమున నొక అవతార పురుషుడు జన్మించి పతితు లగు మానవుల నుద్ధరించి, మరల ధర్మసంస్థాపనము కావించు ననియు, అన్ని దేశములందలి ప్రజలను సర్వసాధారణముగ విశ్వసించు చుందురు. యూదులలో కూడ నట్టి విశ్వాసము ప్రబలి యుండెను. యూదుల మత గ్రంథములందు కూడ భవిష్యత్కాలమున నొక మహాపురుషుడు జన్మించు నను నంశము అనేక ప్రదేశములలో విస్పష్టముగ తెలుపబడి

యుండెను. యూదు మత ప్రవక్తయగు మోజెస్ కూడ ఒకా నొక సందర్భమున "పరమేశ్వరుడు నావంటి ప్రవక్తనే మరి యొకనిని మీలో జన్మింప జేయును. అతని బోధనలను మీరు గౌరవింప వలయును." అని తెల్పి యుండెను. మతగురువులలో కొందరు భవిష్యద్యుగమున జన్మింపబోవు నీ మహాపురుషుడు రాజ వంశమున పుట్టునని అభిప్రాయపడిరి. కావున యూదు ప్రజలలో కొందరీ యవతార పురుషుడు తమకు, ధార్మిక, ఆముష్మిక విషయములలో నాయకుడుగ నుండుననియు, మరి కొందరాతడు మహాతేజోవంతుడగు రాజమార్తాండుడుగ అవతరించుననియు తలంచుచుండిరి. ప్రజల ఆశలును, ఆశ యములును, కాలమాన పరిస్థితుల ననుసరించి మార్పునకు లోనగుట సహజము. జూడాస్ మెకాబిస్ అను యూదు వీరుడు విదేశీయులగు యవనులతో విజయవంతముగ పోరి స్వతంత్రరాజ్యమును స్థాపించిన కాలమున యూదులు తమ జాతియం దుద్భవింపబోవు అవతారపురుషుడు మతధార్మిక విషయములలో తమకు నాయకుడుగ నుండునని యెంచిరి. కాని కాలము గడచి యూదు రాజులు బలహీనులై రోము నల యాధిక్యత పాలస్తీనమున ప్రబలుట ప్రారంభించిన కొలదియు. ప్రజలు తమ జాతియందు జన్మింపబోవు మహ నీయుడు మహావీరుడగు రాజనియు, ఆతడు యూదు రాజ్య మును స్వతంత్రము కావించుననియు, ఆతడు బెత్లిహేమ్ నగర మున ప్రాచీన యూదు ప్రభువగు దావీదు వంశమున జన్మించు

వనియు గట్టిగ విశ్వసింపసాగిరి. ఇట్టి పరిస్థితుల యందనతార పురుషుడగు ఏసు క్రీస్తు జూడా రాజ్యమున బెత్లెహేము పట్టణమున జన్మించెను.

ఈ కాలమునాటికి పాలస్తీనమందు రోమనుల అధికారము సంపూర్ణముగ బలపడెను. తన సామ్రాజ్యమందున్న ప్రజలందరును తలకొక యింత చొప్పున పన్నుల నియ్య వలెనని రోమను చక్రవర్తి యగు ఆగస్టస్ సీజరు ఆజ్ఞాపించెను. రాజాజ్ఞానుసారము పన్నుల చెల్లించు నిమిత్తము నాజరెత్ అను పట్టణమున నివసించు జోసెఫ అను నాతడు తనకు భార్య కాబోవుచున్న మేరీ అను స్త్రీని వెంటబెట్టుకొని బెత్లెహేమ్ పట్టణమునకు వచ్చెను. వారు ధనికులుకారు. కాని ఉన్నత కుటుంబమునందు జన్మించినవారు. అప్పటికి మేరీ గర్భవతిగ నుండినందున ఆమె మగశిశువును కనెను. పేదరాలైన యామెకు పూటకూటి యింటి యందు విశ్రమించుటకు స్థలము లేనందున, ఆమె తన బిడ్డను బట్టలచే చక్కగ కప్పి, పశువులశాలలో పరుండ బెట్టెను. ఆ దేశమున పశువుల కాపరు లనేకులు రాత్రియందు తమ పసులమందలను కాపాడుచు విశ్రమించియున్న సందర్భమున వారి కొక మహత్తర సంఘటనము కల్గినట్లు చిన్నెలు చూపట్టెను. నల్గడల వారికి దివ్యజ్యోతి కానవచ్చెను. దేవకన్యలు లోకోత్తరుడైన మహా పురుషు డొకడు జన్మించెనని గానము చేయసాగిరి. అంత నా గోపాలకులు శీఘ్రముగ బయలువెడలి పశుశాల యందున్న

జోసెఫ్ మేరీలను, నూతనముగ జన్మించిన శిశువును సందర్శించి ధన్యులైరి. అదే సమయమున ప్రాగ్దేశముల నుండి కొందరు మహా విజ్ఞానులేతెంచిరి. "యూదులకు రాజు కాబోవు ఆ మహాపురుషు డెచ్చట నున్నాడు? ఆతని జన్మ నక్షత్రమును గుర్తుగ బెట్టుకొని, మే మింతదూరము రాగల్గితిమి." అని వారు పల్కిరి. వా రా దివ్యశిశువును భక్తిపురస్సరముగ పూజించి తమ తమ దేశములకు వెడలిపోయిరి. రోమక సామ్రాజ్యమునకు సామంతుడుగ పాలస్తీనమునందు పరిపాలనము చేయుచున్న హీరాద్ రాజున కీ సమాచారము తెలియ వచ్చెను. నూతనముగ జన్మించిన యీ శిశువు పెరిగి పెద్దవాడై తన్ను పదభ్రష్టుని చేయునేమో యని భయపడి, ఆతడు బెత్లెహేము నగరమందును, తత్పరిసరము లందును గల రెండు సంవత్సరములకు పైబడని పురుష శిశువుల నందరిని చంపుడని తన సేవకుల కాజ్ఞ యొసంగెను. కాని యీ క్రూరమగు నాజ్ఞ అమలు జరుగక పూర్వమే జోసెఫున కొక కల వచ్చెను. తన కుమారున కాపద సంభవింపబోవుచున్నట్లాతడు తెలిసికొని, భార్యా సమేతుడై ఈజిప్టు దేశమునకు వెడలిపోయి, హీరాద్ రాజు మరణించు నంతవరకును అచ్చటనే నివసించెను.

ఏసు క్రీస్తు జన్మించిన నాల్గు సంవత్సరముల తరువాత హీరాద్ రాజు మరణించెను. అవసాన కాలమున నీతడు ఘోర యాతనల ననుభవించి, ఆత్మహత్య కావించుకొనవలయు

నని యత్నించెను. కాని ఆ ప్రయత్నము సాగలేదు. తాను మరణించినప్పుడు దేశమందెల్లెడల దుఃఖమే ఆవరించి యుండ వలయునని ఆతని కొక వింతకోరిక కల్గెను. అంతట హేరాద్ యూదు ప్రముఖుల ననేకుల పిలిపించి అకస్మాత్తుగ వారిని గుఱ్ఱముల తబేలాలో నిర్బంధించి, మహాక్రూరురాలగు తన సోదరి సెలోమెకు వారి నందరను చంపింపవలసినదని యాజ్ఞాపించెను. కాని ఆమెకు కూడ అంతటి క్రూరకృత్యమొనర్చుటకు సాహసములేక వారిని విడచిపుచ్చెను. హేరాద్ రాజు మరణించిన వెనుక పది సంవత్సరముల పాటు ఆర్కేలస్ అను వాడు రాజనామమును వహించి యూదులను పాలించెను. కాని యీతడు ప్రజలకు మిక్కిలి అనిష్టుడై వారి యభిమానమును కోల్పోయెను. సార్వభౌములైన రోమక ప్రభుత్వమువా రీతని యధికారము నంగీకరింపలేదు. ఇంతలో కొందరు యూదులును, సమారిటనులును కూడి రోమక ప్రభుత్వమును సందర్శించి, ఆర్కేలస్పై అనేక నేరములను మోపి, ఆతనిని పదభ్రష్టుని కావింపవలసినదని చక్రవర్తిని కోరిరి. రోమక ప్రభుత్వమువారు ఆర్కేలస్ను తొలగించి, దేశాంతరమునకు పంపివైచి, పాలస్తీనమును పాలించుటకై తమ ప్రతినిధుల నియమించిరి. ఇంతటితో యూదుల స్వాతంత్ర్యము నశించి వారు వేరొక ప్రభుత్వమువారి యధికారమునకు లోనయిరి.

హీరాద్ రాజు కాలమున మహనీయుడైన ఏసు క్రీస్తు జన్మించినట్లు తెల్పియున్నాము. ఆయన తల్లి దండ్రులు తమ కుమారుని ప్రాణమును రక్షించుటకై ఈజిప్టుదేశమునకు పారిపోయినట్లు కూడ మనము తెలిసికొని యున్నాము. జీసస్ పండ్రెండు సంవత్సరముల వయస్సువాడై యున్నప్పు డాతని తల్లి దండ్రు లొక గొప్పఉత్సవ సందర్భమున జెరూసలేమ్ పట్టణమునకు పోయిరి. అప్పు డాతడు తన వారికడ నుండి తప్పిపోయెను. యూదు దేవాలయమునం దాసీనుడై జీసస్ అచ్చటి మహాపండితులతో వాదోపవాదముల నుపక్రమించి తన యసాధారణప్రజ్ఞచే వారి నందర నాశ్చర్యనిమగ్నుల కావించెను. అదే కాలమున జీవించియున్న జాన్ బాప్టిస్టు అను మహనీయుడు ప్రజాసామాన్యమునకు ఏసు క్రీస్తు మహాత్మ్యమును విస్పష్టముగ తెలియజేసెను. "నా తరువాత నొక దివ్యపురుషుడు జన్మింప బోవుచున్నాడు. నే నాతని పాదముల స్పృశించుటకు కూడ అనర్హుడను!" అని బాప్టిస్టు పల్కసాగెను. యువకుడైన జీసస్‌ను, జాన్ బాప్టిస్టు దివ్యజలములచే పునీతుని కావించుసరి కాతని యందొక దివ్యశక్తి ప్రవేశించెను. అంతట "ఈతడు నాకు ప్రియపుత్రుడు. ఈతని యెడ నాకు మిక్కిలి ప్రీతి." అని ఒక అశరీరవాణి పల్కెను. జీసస్‌ను పెడత్రోవలు పట్టింపవలెనని ఆసురశక్తు లెంతయో ప్రయత్నించెను. కాని కృతకృత్యములు కాజాల వయ్యెను. మహనీయుడైన జీసస్ తన అద్భుతజీవితవిధానమును ఉపక్రమించెను. ప్రాచీన

విజ్ఞానులు తెల్పిన ప్రకార మాతడు గ్రుడ్డి వారికి దృష్టి నొసంగెను. బధిరులకు శ్రవణశక్తిని ప్రసాదించెను. కుష్ఠురోగుల నారోగ్యవంతుల కావించెను. మరణించిన వారికి పునర్జీవన మొసంగెను. సామాన్యప్రజల కందరకు నాతడు తన దివ్య సందేశము ను ప్రసాదింప సాగెను. మహాత్ముడగు ఏసు క్రీస్తు కావించిన బోధనలు జగద్విదితములు. మానవు లెల్లరును పరమేశ్వరునియెడ భక్తి కల్గి యుండవలయును. మానవుల నందరను సోదరులుగ ప్రేమింపవలయును. ధర్మవిరుద్ధముగ నెన్నడును వర్తింపరాదు. భూతదయ నెన్నడును విస్మరింప రాదు. అహంకారము నడంచుకొని పరమేశ్వరుడు బోధించిన మార్గమునే అనుసరింపవలెను. సాధువర్తనము నలవరచు కొనవలయును. ఎల్లప్పుడును శాంతి మార్గములనే అన్వేషింప వలెను. హృదయమును నిష్కల్మషముగ నుంచుకొనవలయును. ధర్మమును ప్రతిష్ఠించుటకై మనము ఇతరులు పెట్టు బాధ లన్నిటిని సహింపవలయును. ప్రాచీనులు కొందరు, మనల హింసించినవారియెడ ప్రతిహింసావిధానము నవలంబింప వచ్చునని తెల్పియున్నారు. కాని ఆ ఉపదేశమును విస్మరించి, మనల దూషించువారిని ప్రేమించుటయు, శత్రువుల యెడ నత్యంత స్నేహభావమును పాటించుటయు, మనయెడ మత్సర గ్రస్తులై మనల బాధించువారి క్షేమముకొరకై పరమేశ్వరుని ప్రార్థించుటయు, మున్నగు సద్ధర్మముల నలవరచుకొనవల యును. ఇట్లు ప్రవర్తించిననాడు జగత్పితయగు పరమేశ్వరునికి

మన మనుంగుబిడ్డలము కాగలము. పరమేశ్వరుడు సకల కళ్యాణ గుణ పరిపూర్ణుడు. మనము కూడ ఆయన ననుకరింప వలయును.

ఈ విధముగ తన దివ్య సందేశమును ప్రపంచమున కొసంగుచు మహాపురుషుడగు జీసస్ కొంతకాలము గడపెను. ఇంతలో నాతని కవసానకాలము సమీపించెను. ఆయన ముఖ్యశిష్యులలో నొకడగు జూడాస్ అను వాడు ద్రవ్యలోభముచే తన గురువును శత్రువులకు పట్టియిచ్చెను. యూదులకు గురువైన పురోహితప్రముఖుడు జీసస్ దైవనిందను కావించినట్లు నిర్ణయము చేసెను. రోమకప్రభుత్వ ప్రతినిధి యగు పాంటియస్ పైలేట్ అనువా డాతనిని శిక్షించి, ఇరువురు చోరుల నడుమ నాతని నతిక్రూరముగ శిలువ వేయించెను. పరమసాధువైన జీసస్ ఈ విధముగ మృత్యువువాత బడు సరికి ప్రపంచమందు మహోత్పాతములు సంభవించెను. లోకమెల్ల దుఃఖావేశముచే ఘూర్ణిల్లెను. యూదు దేవాలయు మందలి గర్భగుడికి ముంగిట గల తెర తనంతట తానే రెండుగ చీలిపోయెను. ప్రపంచమందలి వివిధదేశములకు పోయి పరమేశ్వరుడు, ఆయన కుమారుడు, దివ్యమాయ యను నీ మూర్తిత్రయము పేరిట ప్రజలను పునీతుల కావించి, వారికి క్రీస్తు కావించిన ధర్మబోధను వినిపింపవలయు నని దేవదూత యాజ్ఞాపించెనని క్రైస్తవులు విశ్వసించుచున్నారు. అట్టివారికి తా నెల్లప్పుడును చేయూత నొసంగుదు నని కూడ దేవదూత

వలెక్కనట. ఏసు క్రీస్తు బోధనల నాతని శిష్యులు గొప్పత్యాగ మును ప్రదర్శించి అపారవిశ్వాసముతో ప్రపంచమం దంతటను వినిపించి క్రైస్తవమతమునకు వ్యాప్తికల్గించిరి. క్రీస్తు మానవ జాతి కలంకారము లనదగిన మహనీయులలో నొకడని నిస్సంశయముగ తెలుపవచ్చును. అట్టి మహనీయుడు జనించుట వలన యూదుజాతి ధన్యమైనది.

## ప్రాచీనయూదులలో తుదివీరుడు జోసెఫస్

పాలస్తీనము రోమకసామ్రాజ్యమునందు లీనమైన తరువాత సుమా రొక శతాబ్దకాలము శాంతముగ గడచిపోయెను. తుదకు జెస్సియస్ ఫ్లోరస్ అను అధికారిని రోమనులు పాలస్తీనమునకు పరిపాలకునిగ నియమించిరి. ఈతడు మిక్కిలిదుష్టుడు. కొంతకాలము వరకును యూదు లాతని దుష్టపరిపాలనమును సహించిరి కాని తుద కద్యది దుర్భరమయ్యెను. సాహసికు లగు కొందరు ప్రజలు రోమకరాజప్రతినిధి విధించిన పన్నుల నిచ్చుటకు నిరాకరింప నిశ్చయించిరి. కాని దూరదృష్టికల కొందరు యూదు లీ మార్గము నవలంబించుట సర్వనాశనమునకు కారణమగు ననియు, ఏదో స్వల్పకారణము నాధారముగ చేసికొని రోమనులు తమపై రాజద్రోహనేరమును మోపజూచుచున్నా రనియు వాదించిరి. కాని ఉద్రిక్తులగు యూదుల కీ హితవాక్యములు రుచింపలేదు. ప్రతిసంవత్సర

మును రోమను ప్రభుత్వమువారు జెరూసలేము నందలి యూదు దేవాలయమునకు పంపు కానుకలను నిరాకరించుటకు వారు నిశ్చయించిరి. ఇట్లు చేయుట రోమనుల అధికారమును త్రోసిపుచ్చుటయే కాని వేరుకాదు. క్రమక్రమముగ యూదురాజ్యమున్ను సంపూర్ణముగ స్వతంత్రము కావింపవలె నను తీవ్ర వాదమార్గము బలపడెను. యూదులు కొందరు రోమనులను చంపిరి. దాని నదనుగ గొని ఫ్లోరస్ తన సేనలను జెరూసలేమ్ నగరముపై నడపెను. యూదు లందరును దేవాలయము నందు దాగుకొనిరి. రోమను సైనికులు మిక్కిలి ధైర్యముతోడను, చాకచక్యముతోడను పోరాడిరి. వారు దుర్భేద్యమగు కోటను వశపరచుకొనెడివారే కాని భీరుడైన ఫ్లోరస్ ధైర్యము చాలక సేనలతో వెనుకకు మరలిపోయెను. యూదులు కోట నుండి వెలువడి శత్రువులను తరుమసాగిరి. ఫ్లోరస్ ఉక్కుతునకలవంటి నాల్గునూర్ల సైనికులను శత్రువులతో పోరాడుటకై నియమించి మిగిలిన సేనతో పలాయనము కావించెను. పోవునప్పు డాతడు తనవద్ద నున్న బరువైన యుద్ధసామగ్రిని విడనాడవలసి వచ్చెను. నన్నూర్గురు రోమనువీరులును ప్రచండ శౌర్యముతో పోరి శత్రువుల కోపానలమున కాహుతియయ్యిరి. రోమనులు విడచిపోయిన యుద్ధసామగ్రిని యూదులు వశపరచుకొనిరి.

ఇప్పుడు రోమక సామ్రాజ్యమునకును, పాలస్తీనపు ప్రజలకును బహిరంగముగ యుద్ధము ప్రారంభమయ్యెను.

మోజెస్ ప్రవక్త సోదరుడగు ఆరన్ వంశమున జన్మించిన జోసెఫస్ అను వానిని యూదులు తమ నాయకునిగ ఎన్నుకొనిరి. ఈతడు మిక్కిలి ధైర్యశాలి. రణకోవిదుడు. తన ప్రజ్ఞావిశేషముచే రోమునగరమునందు సైతము కీర్తిప్రతిష్ఠలను సంపాదించిన ప్రజ్ఞావంతుడు. ఈతడీ సందర్భమున గెలిలీ రాష్ట్రమునకు నాయకత్వము వహించెను. జోసెఫస్ గొప్ప వీరుడు మాత్రమే కాక, ముందుముందు యూదులకును, రోమనులకును సంభవించిన యుద్ధవృత్తాంతమును సవిస్తరముగ వర్ణించి, ఆ ప్రాచీనకాలమునందలి సంఘటనల సజీవము కావించిన చారిత్రికుడు కూడను. అనతికాలములో రోమనులు కూడ తమ పక్షమును బలపరచుకొనిరి. అనేక రణరంగముల విజయలక్ష్మినిచేపట్టి మహత్తరకీర్తిని సంపాదించిన వెస్పాసియన్ అను వీరుని అరువదివేల సేనతో వారు పాలస్తీనమునకు పంపిరి. యూదులందరును తమ నాయకుని ఆజ్ఞానుసారము, సురక్షితములగు ప్రదేశములకు పారిపోయి దాగుకొనిరి. బహిరంగ యుద్ధములలో రోమనులను జయించుట సాధ్యము కాదని యెరింగి జోసెఫస్ తన సేనలతో "జోటపాటా" అను దుర్గమునందు ప్రవేశించెను. అద్దుర్గము ఒక ఎత్తైన కొండపై నిర్మింపబడి శత్రువులకు దప్రాప్యముగ నుండెను. ఉత్తరభాగమునుండి మాత్రము కోటను సమీపించుటకు మార్గము కలదు. తన సేనలతో ఒక మైలుదూరమున విడిసి కోటకుత్తరభాగమున నొక మార్గమును నిర్మించుటకై వెస్పాసియన్ విశ్వప్రయత్న

ముల కావించెను. కాని యూదులు మహాఘోరముగ పోరాడి రోమనులను వెనుకకు నెట్టివైచిరి. సావధానముగ కాని జోట పాటా కోట వశము కాదని నిశ్చయించి రోమను సేనా నాయకు డందులకై ప్రయత్నములు చేయసాగెను. కోట కనతి దూరమున ఎత్తైన మట్టిదిబ్బల నేర్పాటుచేసి రోమనులు వానిపై తమ యుద్ధయంత్రములను నెలకొల్పి శూలములను, రాళ్ళను, భగభగ మండెడి కాగడాలను శత్రుసైన్యముపై వర్షింపసాగిరి. ఒకవంక రోమనులు మంటిదిబ్బల యెత్తును పెంచినకొలదియు, జోసెఫస్ యాజమాన్యమున యూదులుకూడ తమ కోట గోడల నూర్ధ్వముఖముగ పెంపొందింపసాగిరి. కోటగోడలపై పనిచేయుచున్న కార్మికులకు శత్రువుల ఆయుధములవలన నెట్టి నష్టమును సంభవింపకుండుటకై జోసెఫస్ గోడ పొడవునను దృఢమైన చర్మముల నడ్డు కట్టించివైచెను. ఈ విధముగ రోమనుల ప్రయత్నములు నిష్ఫలము లయ్యెను. కోటలోని కెట్టి యాహారపదార్థములును పోకుండ రోమనులు కట్టుబాటు చేసిరి. కాని యూదులకడ ఆహారపదార్థముల కెట్టి కొరతయు లేనందున వారి కెట్టి నష్టమును సంభవింపలేదు. తమకు నిజముగ బాధ కల్గించుచున్న నీటి కొరతను మాత్రము జోసెఫస్ శత్రువులకు తెలియరాకుండ కప్పిపుచ్చెను. యూదులలో పలువురు రహస్యముగ కోట నుండి వెలువడి, చర్మముల కప్పుకొని, జంతువులవలె నడచుచు పోయి, దేశము నందలి యితరప్రజలను రోమనులపై తిరుగు

బాటు చేయుటకై ప్రోత్సహింపసాగిరి. కోటగోడలను భేదించుటకై రోమనులు విశ్వప్రయత్నములు చేసిరి. కాని యూదులతిసూక్ష్మబుద్ధితో వాని కన్నిటికిని ప్రతీకారము కావించి దుర్గమును రక్షించుకొనగల్గిరి.

భుజబలముచే యూదులను జయింపజాలనుట నిష్ప్రయోజన మని యెరింగి వెస్పాసియన్ మహోపాయము నవలంబించెను. దేశద్రోహులగు కొందరు యూదులు జోసెఫస్ పక్షమును వదలి రోమనులలో చేరిరి. దుర్గరక్షకు లందరును రాత్రి కడపటి యామమున నిద్రింతురని వెస్పాసియన్ వారివలన తెలిసికొనెను. యుద్ధము నలువదియేడవదినమున తెల్లవారుజామున వెస్పాసియన్ కుమారుడగు టైటస్ అను వీరుడు మరికొందరు వీరులను సహాయముగ గొని, ఎల్లెడల కప్పియున్న మంచుతెరలో నణగి కోటగోడను సమీపించి, కావలివాండ్రను సంహరించి, లోపల ప్రవేశించి దుర్గద్వారములను తెరచివైచెను. ఈ విధమున కోట రోమనుల స్వాధీనమయ్యెను. జోసెఫస్ నలువదిమంది మిత్రులతో కలసి యొక రహస్యమందిరమున దాగుకొనెను. రోమను లీ ప్రదేశమును కూడ కన్గొనిరి. శత్రువులకు లొంగుటకంటె మరణమే మేలని నిశ్చయించి యూదువీరు లందరు నొండొరుల చంపుకొని మరణించిరి. జోసెఫస్‌ను, మరియొక యూదుడును మాత్రము సజీవులైయుండిరి. వారు తమంత తామే శత్రువులకు వశమయిరి. చిరకాలమువరకును తమకు లొంగక బాధించిన జోసెఫస్‌పై రోమను సైనికులు కక్షవహించియుండిరి. తక్షణమే

ఆతనిని సంహరింపవలసిన దని వారు వెస్పాసియన్‌ను నిర్బంధించిరి. కాని ఉదారహృదయుడగు టైటస్ తండ్రి కనేక విధముల బోధించి, జోసెఫస్‌ను రక్షించెను. సూక్ష్మబుద్ధియైన జోసెఫస్ ఈ యవకాశమును పురస్కరించుకొని "నీవును నీ యనంతరము నీ కుమారుడు టైటస్‌ను రోమకచక్రవర్తులు కాగలరు. నా పల్కులలో విశ్వాసము లేని పక్షమున నా శుభసమయ మేతెచువరకు నన్ను బందీగ నుంపుము." అని వెస్పాసియన్ కుత్సాహము కల్గించెను. ఆ కారణముచే రోమను సేనాని జోసెఫస్‌ను నిర్బంధించియు, సగౌరవముగ చూడసాగెను. కొలది కాలము గడచెను. రోమనుసామ్రాజ్య సింహాసనము నధిష్ఠించు గౌరవము వెస్పాసియన్‌కు కల్గెను. ఆతడు జోసెఫస్ చెప్పిన జోస్యము జ్ఞప్తికి తెచ్చుకొని, ఆతనిని చెరనుండి విడిపించి మిక్కిలి గౌరవించెను. కాని చిరకాలమునుండి రోమను సామ్రాజ్యమును ధిక్కరించి, అహంకారముతో వర్తించుచున్న జెరూసలేమ్ నగరమును జయించి నాశనముచేయుటకై మహాసమర్థుడగు తన కుమారుడు టైటస్‌ను నియమించెను.

# జెరూసలేమ్ నగరవినాశము- యూదుల పతనము

ప్రాచీన యుగము నందలి మహత్తర సంఘటనలలో జెరూసలేమ్‌ను నగర పతన మొకటి. దీనివలన యూదు ప్రజల కన్నిటికిని దేశభ్రష్టత సంభవించెను. ఈ పట్టణమును జయించుట యందు రోమనులు తమ శౌర్యపరాక్రమములను, పట్టుదలను సంపూర్ణముగ ప్రదర్శించిరి. ఆనాటికే రోమకసామ్రాజ్యము ప్రపంచాధిపత్యమును వహించి యుండెను. వారి సేన లజేయము లని జగద్విఖ్యాతి చెందియుండెను. కాని అట్టి వీరులగు రోమనులకు కూడ జెరూసలేమ్ పట్టణము మిక్కిలి కష్టముపై వశపడెను. నగరరక్షకులైన యూదులు తమ దేహమందలి ప్రతి రక్తబిందువును ధారపోసి రోమనులతో పోరాడిరి. యూదువీరుడైన జోసెఫస్ రోమనుల సేనలతో యుద్ధక్రమమును స్వయముగ చూచి అందలి వివరములను గ్రంథస్థము చేసిన కారణమున నీ యుద్ధవిశేషము లన్నియు మనకు చక్కగ తెలియవచ్చినవి. జెరూసలేమ్ నగరము రోమనులకు సులభముగ వశపడకపోవుటకు దాని సురక్షితమైన స్థానమును, దాని చుట్టునుగల అభేద్యమగు ప్రాకారములును ముఖ్యకారణములు. ఈ పట్టణమునకు మూడు ప్రక్కల మిక్కిలి ఇరుకైన కనుమలు కలవు. ఇవి చాలలోతుగకూడ నుండును. పట్టణమునకు వాయువ్యదిశ యందు మాత్రము

పైన తెల్పిన కొండవారులు లేవు. ఈ ప్రదేశ మంతయు సుమారు అయిదు చతురపుమైళ్ళ వైశాల్యము కల్గి, పళ్ళెము వలె చుట్టును విస్తృగను, నడుమ పల్లముగాను ఉండును. పర్వతావృతమైన యీ ప్రదేశము నందు తూర్పు భాగమున మోరియా అను కొండపై సుప్రసిద్ధమైన యూదు దేవాలయము కలదు. మోరియా కొండకు పశ్చిమమున శత్రువుల కెవ్వరికిని సమీపించుట కలవికాని మరియొక ఎత్తైనకొండ కలదు. ఇదియే సుప్రసిద్ధమైన "జియాన్" పర్వతము. దీనిపైననే ప్రాచీనకాలమున డేవిడ్ రాజు జెరూసలేమ్ నగరమును స్థాపించెను. పట్టణమున కంతకును సురక్షితమైన భాగ మదియే. దేవాలయమునకు దిగువభాగమున పట్టణము వ్యాపించియుండెను. దేవాలయమునుండి పట్టణములో రాకపోకలు సల్పుటకై చక్కని బాటలు నిర్మింపబడియుండెను. మోరియా కొండపై సుప్రసిద్ధుడగు సాలమన్ రాజు నిర్మింపించిన బలిష్ఠమైన ప్రాకారము కలదు. అందు చలువరాళ్ళచే కప్పబడిన విశాలమైన ముంగిళ్ళును, అచ్చటచ్చట సువిస్తీర్ణములును, జలప్రపూర్ణములు నగు జలాశయములును కలవు. వలయువారి కచ్చట కావలసినంత పరిశుభ్రమగు జలము లభ్యమగును. దేవాలయము రెండునూర్ల గజముల పొడవుగల చతురస్రాకార ప్రాకారమున నెలకొనియుండెను. దేవళమున కొకప్రక్కన మిక్కిలి లోతైన కొండదారి కలదు. మిగిలిన మూడు పార్శ్వము లందును. సాలమన్ రాజు నిర్మించిన ప్రాకారము

గలవు. ఈ ప్రాకారనిర్మాణమునం దుపయోగింపబడిన రాళ్ళలో కొన్ని అరువది అడుగుల పొడవైనవి. దేవాలయమునకు చుట్టును బలిష్ఠమైన సీడరు దారువులచే నిర్మింపబడిన మండపములు కలవు. అవి యూదుమతమునకు చెందని ఇతర ప్రజల సౌకర్యమునకై నిర్మింపబడెను. అచ్చట గ్రీకుభాషయందు, "సత్యమగు యూదుమతము నంగీకరింపనివా రెవ్వరును పవిత్రమగు దేవాలయమునందు ప్రవేశింపకుందురు గాక!" యని వ్రాయబడియుండెను. మంటపమునకు సమీపమునందే యున్న పదునాల్గు మెట్లు నెక్కి చూచినయెడల దేవాలయము కానవచ్చును. అచ్చట నే ద్వారమునకును తలుపులు లేవు. స్వర్గద్వారము ఎల్లప్పుడును వివృతములై యుండు నని దీని భావము. దేవాలయముపై బంగారు ద్రాక్షతీగలు ప్రాకింపబడెను. ఆ తీగలపై మిక్కిలి బరువైన పండ్లగుత్తులు కూడ అమర్చబడియుండెను. దేవాలయ ముఖమున మిక్కిలి విలువగల బాబిలోనియా వస్త్రములచే సిద్ధపరుపబడిన తెరలు వ్రేలాడకట్టబడెను. ఆ తెరలు వివిధవర్ణములు కల్గి, పంచభూతములను సూచించుటకై ఉద్దేశింపబడెను. వాయువు నీలవర్ణముగను, భూమి పసుపు పచ్చగను, అగ్ని ఎఱుపుగను, సముద్రము నీలరక్తమిశ్రితముగను ఉండునని యూదులు భావించిరి. దేవాలయమునందు ఏడు శాఖలుగల బంగారు దీపస్తంభము నెలకొనియుండెను. ఏడుశాఖలు సప్తగ్రహకూటమును సూచించును. దానికి సమీపమందలి యొక పవిత్ర

వేదికపై నుంపబడిన పండ్రెండు అపూపములును ఆకాశ మండలి పండ్రెండు రాసులకును ప్రత్యామ్నాయములుగ భావింపబడెను. అచ్చట నిరంతరమును సుగంధ ధూపము లెగయుచు పరమేశ్వరుడు సమస్తైశ్వర్యసంపన్ను డని శోభించు చుండెను. గర్భాలయములోని కెట్టివారును కూడ పోరాదు. దేవాలయమును రక్షించు ద్వారములకు "సుందరములు" అని పేరు. ఇవి డెబ్బదియై దడుగుల యెత్తును, ఏబది యడుగులు వెడల్పును గల అద్భుతమైన కవాటములు. వీనిని "కొరింథ్" అను పట్టణమున లభ్యమగు అత్యుత్తమమగు ఇత్తడితో నిర్మించిరి. బ్రహ్మాండమైన యీ తలుపుల నిరువదిమంది బలాఢ్యులగు మనుష్యు లతికష్టముపై మూయుచుండెడివారు. అద్భుతమైన యీ దేవాలయమును గాంచి ఎల్లవారు నాశ్చర్య నిమగ్ను లగుచుండిరి.

ఈ దేవాలయ మత్యంత శోభావంతముగ నుండుటయే కాక శత్రువులనుండి సర్వవిధముల పరిరక్షితమై యుండెను. దీని కుత్తరభాగమున హీరాద్ రాజు, ఆంటోనియా యను పేరితో మిక్కిలి బలిష్ఠమైన యొక దుర్గమును నిర్మించి యుండెను. ఈ దుర్గ మొక యెత్తైన కొండపై కట్టబడెను. దీని నడుమ సుమారు అరువది అడుగుల ఎత్తుగల ఒక స్తంభము నిర్మింపబడెను. చుట్టును గల ప్రాకారముపై బురుజులు కలవు. అందొకటి సుమారు నూరడగుల ఎత్తు గలది. ఆ బురుజుపై నిలుచుండిన పక్షమున దేవాలయపు లోపలిభాగ మంతయు

స్పష్టముగ కాన్పించును. ఈ కోటలో విశాలమైన భవనము లును, సభామందిరములును, మైదానములునుకూడ నుండెను. రోమనులు దీని నాక్రమించుకొనిన పిమ్మట ఈ దుర్గమునందు కొంతసేనను స్థిరముగ నెలకొల్పిరి. ఆ సైనికు లవసరమైన ప్పుడు యూదు దేవాలయములోనికిని, జెరూసలేమ్ పట్టణము లోనికిని కూడ సులభముగ పోగల్గుచుండిరి.

ప్రకృతిచే నొసంగబడిన సంరక్షణమును జెరూసలేమ్ రాజులు స్వప్రయత్నముచే మరింత బలపరచిరి. పట్టణము చుట్టును మూడు బలిష్ఠమైన ప్రాకారములు నిర్మింపబడెను. ఇరుకైన కొండదారులచే నగరము రక్షింపబడుచున్న ప్రదేశ ములందుమాత్ర మొకే ప్రాకార ముండెను. ఈ ప్రాకార ములు మిక్కిలి దృఢమై ముప్పది యడుగుల ఎత్తుగ నుండెను. వీనిపై సైనికులకొరకై చిన్నచిన్న గదులును, నీటిని సేకరించి జాగ్రతపరచుటకై పెద్ద తొట్టెలు నుండెడివి. కోటగోడపై సుమారు నూటఅరువది బురుజులు నిర్మింపబడెను. ఇట్టి ప్రబల మగు రక్షణలచే నొప్పారుచున్న జెరూసలేమ్ నగరము, చిరకాలమువరకును శత్రువులకు వశము కాకపోవుట ఆశ్చర్య కరమగు నంశముకాదు. కాని జెరూసలేమ్ నగరమున నివ సించుచున్న యూదులకు మున్నెన్నడును కాన్పింపని దుశ్శకు నములు కాన్పింపసాగెను. తమ కత్యంతప్రియమైన యీ పట్టణమున కొక మహత్తరమగు నాపద సంభవింపనున్నదని వారు తెలిసికొనిరి.

రోమునగరమున వెస్పాసియన్ సింహాసన మధిష్ఠించిన తరువాత కొన్ని నెలవరకును జెరూసలేమ్‌పై దాడి జరుగలేదు. ఈ కాలమున వారు తమ సేనలను సమకూర్చుకొని యుద్ధసన్నాహములు చేయసాగిరి. రోమను సేనయందు మిక్కిలి యుద్ధానుభవముగల విభాగములను పాలస్తీనవిజయమునకై రోమను ప్రభుత్వమువారు పంపిరి. ఈ సేనయందొక లక్ష సైనికులును, అపారమైన యుద్ధసామగ్రియు నుండెను. ఈ సైనికు లందరును చక్కని క్రమశిక్షణ పొందినవా రగుటవలన, సేన యెల్ల బలిష్ఠమైన చట్రములో నమర్పబడిన పటమువలె సక్రమముగ ముందునకు సాగిపోవుచు శత్రువులకు భయము గొల్పసాగెను. రోమను సేన యెంత బలిష్ఠమైనను, ఆ సైనికు లెంతటి క్రమశిక్షను పొందినను వారు స్వశక్తిచే జెరూసలేమ్ కోటను వశపరచుకొనుట దుస్సాధ్య మయ్యెడిది. కాని వారి యదృష్టమువలన యూదులలో నంతఃకలహములు చెలరేగి వారిని బలహీనపరచెను. ఒకవంక రోమనులతో హోరాహోరీగ పోరాడుచుండియు, వారు తమలో కల భేదములను మరువజాలకపోయిరి. ఈ సమయమున యూదులలో మూడు కక్షలుండెను. ఒకటి మితవాదపక్షము. దీనికి యూదుల పురోహితప్రముఖుడగు ఎనానస్ అను నాతడు నాయకుడు. రోమనులవంటి బలశాలులగు శత్రువులతో పోరాడుట ఆత్మవినాశనమునకు కారణమగు నని వారు చక్కగ గుర్తించియుండిరి. కావున రోమనులతో నేదో యొక విధ

ముగ సంధి కావించుకొనవలయు నని వారు తలంచుచుండిరి. కాని వీరి యుద్దేశ్యము లతివాదపక్షము వారి కెంతమాత్ర మును రుచింపలేదు. రోమనుల దండయాత్ర ప్రారంభమైన సందర్భమున చుట్టుప్రక్కలనుండి ధూర్తులగు ప్రజ లనేకులు జెరూసలేమ్ నగరమున ప్రవేశించి, అతివాదపక్షమున చేరిరి. వీరికి నాయకుడుగ గిస్కాలా ప్రాంతమునకు ప్రభువైన జాన్ అను సాహసికుడు వచ్చిచేరెను. రోమను సైనికులీతని పట్టణమును నాశనముచేసి తిరిమ్మైచిరి. ఈ విధముగ శత్రువులచే పరాభ వింపబడియు నాతడు, రోమనులను సులభముగ జయింపవచ్చు నని వాదింపసాగెను. వీరు దేవాలయాంతర్భాగమున నెల కొనియుండిరి. వీరికి సహాయముగ మిక్కిలి ధైర్యశాలురును, దేశభక్తులు నగు 'ఇడూమియనులు' అను జనులు వచ్చిచేరిరి. మితవాదపక్షమునకు నాయకుడగు ఎనానస్ వీరిని లోనికి రానీయకుండ నిరోధించెను. కాని అర్ధరాత్రమున ప్రచండ మగు తుపాను చెలరేగుచున్న సమయమున జాన్ గిస్కాలా పక్షమువారు రహస్యముగ కోటతలుపులను తెరచి వారిని లోనికి రప్పించిరి. రోమనులు జెరూసలేమ్ నగరమును సమీ పించుసరికి యూదులలో కలహములు మరింత హెచ్చెను. అతివాదపక్షములో మరియొక వామపక్షము బయలుదేరి, వారు జాన్ గిస్కాలాను దేవాలయాంతర్భాగమునుండి బయ టికి తరిమివైచిరి. మితవాదనాయకుడగు ఎనానస్ చనిపోగా

అతని స్థానమున సైమన్ అను నాతడు నాయకుడుగ నియమింపబడెను.

ఈ విధమున నంతఃకలహముచే క్షీణసత్త్వులయ్యును యూదులు రోమనుసేనతో మహాభయంకరముగ పోరాడుట వారి దేశభక్తికిని, ధైర్యసాహసములకును గొప్ప తార్కాణము. యుద్ధప్రారంభదశయం దొకనాడు రోమను సేనలకు నాయకుడగు టైటస్, ఆత్మసంరక్షణమునెడ నశ్రద్ధవహించి జెరూసలేమ్ దుర్గమునకు మిక్కిలి సమీపముగ వచ్చెను. అతనిని చూచి యూదులకస్మాత్తుగ కోటతలుపులను తెరచి, టైటస్‌ను చుట్టుముట్టిరి. అంగరక్షకులుగనున్న రోమను సైనికులు తమ నాయకునుండి విడివడిపోయిరి. టైటస్‌నకు మిక్కిలి ప్రమాద పరిస్థితి యేర్పడెను. కాని యాత డొంటరిగాడయ్యు మిక్కిలి సాహసముతోడను, చాతుర్యముతోడను, శత్రువులను బెదరగొట్టి తన స్కంధావారమును చేరుకొనెను. ఆనాడు మొదలుకొని టైటస్ మరెన్నడును అశ్రద్ధతో ప్రవర్తింపలేదు. రోమనులు తమ దుర్గమునకు సమీపమున స్థావరములేర్పరచుకొనకుండ చేయుటకై యూదులు విశ్వప్రయత్నములు చేసియు విఫలమనోరథులైరి. రోమనులు కోటకుత్తరభాగమునందలి మైదానమును చదును పరచి, గోడలకు రెండు ఫర్లాంగుల దూరమున తమ శిబిరము నేర్పాటు కావించుకొనిరి. అచ్చటినుండి వారు తమ యుద్ధమును సాగించిరి. రోమనులు శత్రుసంహారమునకై ధనుర్బాణముల

తోను, విశిష్టముగ తమ యుద్ధయంత్రములతోడను, పోరాడ జొచ్చిరి. వీరు ప్రయోగించెడి యంత్రము లెట్లు నడుప బడెడివో వివరముగ తెల్పుట సాధ్యముకాదు. కాని వానిలో కొన్ని పెద్ద ఇనుపకొయ్యల నవలీలగ నెత్తి కోటగోడలను నిరంతరము మోదుచుండెడివి. ఈ అనవరతప్రహారములచే నెంతటి బలిష్ఠమైన కుడ్యములును కూడ లొంగిపోవుట సామాన్యము. రెండవ రకపు యంత్రములు బరువైన రాళ్ళ నెత్తి, రెండు మూడు ఫర్లాంగుల దూరమువరకును గొప్ప వేగముతో విసరుచుండెడివి. చుట్టుప్రక్కలనున్న పెద్దపెద్ద చెట్ల నన్నిటిని కొట్టించివైచి టైటస్ వానితో తన సైనికుల కొరకై ఎత్తైన మంచెలను కట్టించెను. శత్రువులు కోటగోడల చేరకుండ యూదులు వారిపై నిరంతర శరవర్షము కురియించు చుండిరి. అప్పుడప్పుడు వారిలో కొందరు కోటనుండి వెలువడి రోమనులపై అకస్మాత్తుగ దాడి చేయుచుండెడివారు. కాని యుద్ధవిధానమునం దారితేరిన రోమనులకీ యవరోధము లొక లెక్కలోనివి కావు. యుద్ధము ప్రారంభమైన పదు నేనవ దినమున వారు జెరూసలేమ్ పట్టణమునకు చుట్టునుగల మూడవ ప్రాకారమును భేదించిరి. మరి నాలుగు దినములు గడచునంతలో రెండవ ప్రాకారముకూడ రోమనుల యంత్ర ముల కాగలేక పడిపోయెను. ఇప్పటికి రోమనులు పట్టణమందు ప్రవేశించిరి. రాజనీతిజ్ఞుడైన టైటస్ విజితులగు యూదులను తన వంకకు త్రిప్పుకొనుటకు వారియెడ మిక్కిలి దాక్షిణ్యముతో

వర్తించి, ప్రజల నెవ్వరను చంపరాదనియు, ఇండ్లను నాశనము చేయరా దనియు, తన సైనికుల కాజ్ఞాపించెను. రోమనులకు గల అపారమగు బలమును శత్రువుల యెదుట ప్రదర్శింప వలయు ననికూడ ఆతడు నిశ్చయించెను. ఈ యుద్దేశ్యముతో టైటస్ తన సైనికులకు కొన్ని దినములు విరామ మొసంగుటయే కాక, వారికి కావలసినంత యాహారమును పంచి యిచ్చెను. నియమితదినమున రోమనుల సేనలు జెరూసలేమ్ పట్టణపు మొదటి కోటగోడ ముందు తమ యపారబలమును ప్రదర్శించుచు నడువసాగెను. కవచధారులగు పదాతులు ముందర నడచిరి. వారి వెనుక నుత్తమాశ్వముల నధిష్ఠించి అత్యంతబలశాలులగు రోమనువీరులు నడచిరి. ఇట్టి బలప్రదర్శనమువలన భయపడి యూదులు తనకు శరణాగతు లగుదురని టైటస్ తలంచెను. యూదులకు నాయకత్వము వహించి వెస్పాసియన్‌తో పోరిన జోసెఫస్ అను యూదువీరు డిప్పుడు రోమనులవద్ద మిత్రభావముతో నివసించుచుండెను. యూదులు యుద్ధమును మానివైచి తక్షణమే టైటస్‌తో సంధి కావించుకొనవలయు ననియు, అట్లు కావించిన యెడల రోమనులు వారితో స్నేహమును నెరపుదు రనియు, యుద్ధము మరికొంతకాల మిదే విధముగ సాగినపక్షమున రోమనులు, మిక్కిలి కోపగించి అత్యంతక్రూరత్వముతో వర్తింతు రనియు, జోసెఫస్ తన దేశీయులకు బోధించెను. యూదులలో పలువురు కాతని హితవాక్యములు రుచించెను. కాని వారి నాయకులు మాత్రము

రోమనులకు లొంగిపోవుట కెంతమాత్రము నంగీకరింపలేదు. అంతేకాక యుద్ధవిరామమును కనుకూలురుగ నున్నట్లను మానము తోచినవారి నందరను, ఈ యతివాదపక్షమువారు నిర్దయులై చంపించిరి.

ఇంతలో గ్రీష్మము ప్రారంభమయ్యెను. భరింపరాని వేడివలన దుర్గమునందలి యూదు లపరిమితమగు బాధలకు లోనైరి. కోట వెలుపలనుండి రోమను సైనికులు తమ యంత్రములు సహాయమున దుర్గమందలి యిండ్లను పడగొట్టుచు, అందు నివసించువారికి ప్రాణాపాయము కల్గింపసాగిరి. పట్టణము చుట్టును గల కొండదారులలో రోమను సైనికులు నిరంతరము తిరుగుచు, దుర్గరక్షకు లించుక అప్రమత్తత వహించిన పక్షమున నచ్చటినుండి లోనికి ప్రవేశింపవలె నని యత్నింపసాగిరి. దుర్గమున కుత్తరదిశయందు రోమను సేన లత్యుత్సాహముతో, మిగిలియున్న ఒక్క ప్రాకారమునుకూడ కూలద్రోయ వలయునని యత్నించుచుండెను. ఇది యిట్లుండగా కోటయందు కాటకము ప్రారంభమయ్యెను. యుద్ధమునందు పాల్గొనుచున్న సైనికులు ఆకలిగొన్న పులులవలె పట్టణవాసులపై బడి వారు దాచుకొనిన ఆహారపదార్థముల తమ కీయవలసినదని మిక్కిలి బాధింపసాగిరి. ఘోరమైన యా కరవుకాలమున భార్యలు భర్తలనుండియు, పిల్లలు తల్లులనుండియు, తల్లులు పసిబిడ్డలనుండియు ఆహారవస్తువులను బలవంతముగ గైకొని క్షుద్బాధను చల్లార్చుకొనసాగిరి. ఆహార

సంపాదనముకొరకై రహస్యముగ కొందరు కోటవెలుపలకు పోవుచుండిరి. అట్టివారిని నిర్బంధించి రోమనులు మిక్కిలి క్రూరముగ సిలువవేయుచుండిరి.

రోమను సేనానాయకుడైన టైటస్ పదునేడుదినములు కష్టించి ఎత్తైన దిబ్బలను కట్టించెను. వానిపై నిలువబడి తన సైనికులు శత్రువులతో పోరాడవలయు నని ఆతని యుద్దేశ్యము. కాని దుర్గరక్షకులలో నొకడైన జాన్ గిస్కాలా ఈ మంటి దిమ్మల యడుగున నొక సొరంగమును త్రవ్వించి మందుసామానుతో వానిని ప్రేల్చివేయుటకై రోమనుసైనికు లనేకులు మరణించిరి. ఇంతలో కోటగవనులు తెరిపించి సైమన్ అను మరియొక వీరుడు తన సైనికులతో శత్రుమారణమునకు పూనుకొనెను. వీనివలన రోమనులకు మిక్కిలి నష్టము కల్గినను వా రనతికాలములో తమ సైన్యవ్యవస్థను చక్కపరచుకొని మరల యుద్ధము సాగించిరి. మూడుదినములు గడువకుండగనే టైటస్ మరల పట్టణముచుట్టును మంటిదిబ్బలను కట్టించి శత్రువుల వేధింపసాగెను. యూదు లపరిమితముగ మరణింపసాగిరి. మృతదేహములను కోటగోడలమీదనుండి క్రిందికి విసరివేయసాగిరి. పట్టణపు వీథులందు శవములు కుప్పలు తిప్పలుగ పడియుండెను. మరికొందరు కోటగోడలపై నుండి క్రిందికి దుమికి ఆత్మహత్య కావించుకొనసాగిరి. రాతి గుండెగల టైటస్ కూడ ఈ ఘోరదృశ్యముల చూచి మిక్కిలి చింతాక్రాంతుడైనట్లు తెలియుచున్నది. కాని యుద్ధము

మాత్ర మొక్కదినమైనను ఆగలేదు. రోమనులు తమ కవచములను కచ్ఛపాకారముగ పన్ని కోటగోడలను పగులగొట్ట దొడగిరి. యుద్ధయంత్రములు దుర్గకుడ్యముల నిరంతరమును ఇనుపదిమ్మెలతో మోదజొచ్చెను. తుదకు లోహసదృశమైన యా గోడ బీటలువారి కొన్ని రాళ్ళు ఊడివచ్చెను. కాని అప్పటికే జాన్ గిస్కాలా ఆ గోడకు వెనుక మరియొక గోడను కట్టించియుంచెను. కాని యూదుల ప్రతిఘటనము నిరర్థకమయ్యెను. మరి రెండుదినములలో కొందరు రోమను సైనికులు ఆంటోనియా దుర్గముపై కెక్కి దాని నాక్రమించుకొనిరి. ఈ విధముగ దుర్గము శత్రువులకు వశ మగుసరికి యూదువీరులు పారిపోయి దేవాలయమునందు దాగికొనిరి. రోమనులు ఆంటోనియా దుర్గమును కూలద్రోసి దేవాలయమును సమీపించిరి. కాని యూదులు పెద్దమంటలను రగుల్కొల్పి శత్రువులను దరిజేరనీయకుండ వెనుకకు తరుమసాగిరి. ఈ విధముగ రెండుదినములు గడచిపోయిన వెనుక నొకనాడు యూదుసైనికు డొకడు దేవాలయమునకే అగ్నిని దొంకొల్పెను. జగత్ప్రసిద్ధమైన ఆ దేవాలయమును సంరక్షింపవలయునని టైటస్ చింతించెను. కాని గాలి తీవ్రముగ వీచుచుండుటవలనను, ఇంతకుపూర్వమే శత్రుమారణమునకై మందుసామాను లచ్చటచ్చట చేర్పబడి యుండుటవలనను వీతిహోత్రుడు మహాభయంకరముగ ప్రజ్వరిల్లసాగెను. ఈ దావానలమందు అపూర్వమైన యూదుదేవాలయమున ననేక

భాగములు అగ్నిపాలయ్యెను. జయాభిలాషతో ఒండొరులతో పెనగులాడుచున్న యూదురోమను సైనికులపార్థముగ నాదావానలమధ్యమున చిక్కుకొని శలభములవలె మాడిపోయిరి. భూమియంతయు మృతదేహములచే కప్పబడిపోయెను. యూదు పురోహితులు తుది నిముసమువరకును శత్రుసంహారణమునకై ఆయుధముల వెదకికొనుచు, కోలాహలము చేయుచు, తుదకు మార్గాంతరము లేక మంటలలో పడి మరణించిరి. టైటస్ సేనానియు, ఆతని యనుచరులును మంటలు చల్లారిన వెనుక నా దేవాలయమును ప్రవేశించి దాని యద్భుతసౌందర్యమునకును, వైభవమునకును మిక్కిలి నివ్వెరపడిరి. జయసూచకముగ రోమనులు తమ పతాకమును కోటద్వారముకడ నెగురవైచిరి.

యూదు పురోహితులలో నొకడగు జాషువా అను నాతడు దేవాలయమునకు సంబంధించిన అమూల్యవస్తువుల నన్నిటిని టైటస్ సేనానికి సమర్పించెను. ఏడు శాఖలుగల బంగారు దీపస్తంభమును, బంగారు తిన్నెలును, పాత్రములును, పురోహితులు ధరించు అమూల్యములగు వస్త్రములును, వజ్రములును, మిక్కిలి విలువగల రంగుసామానులు, సుగంధద్రవ్యములు మున్నగువాని నన్నిటిని యూదులు రోమను సేనాని కొసంగిరి. జెరూసలేమ్ దుర్గమును మిక్కిలి పట్టుదలతోడను, సాహసముతోడను, సంరక్షించిన జాన్ గిస్కాలా చెరసాలలో మరణించెను. సైమన్ అను నాతడు శత్రువులకు

బాకీగ జిక్కెను. రోమనులు మూడు బురుజులను విడచి, మిగిలిన కోటగోడను సంపూర్ణముగ నాశనము చేసిరి. ఈ భయంకర యుద్ధమున ప్రాగ్గొని జయమును సాధించిన తన సైనికులకు టైటస్ సేనాని బంగారుకిరీటములను, ఈటెలను, బహూకరించెను. జెరూసలేమ్ నగరవినాశనమువలన మిక్కిలి నష్టపడినవారు యూదులు. యుద్ధమునందు పదునొకండు లక్షల మంది మరణించిరట! సుమారు రొకలక్షమందిని రోమనులు చెర పట్టిరి. వారిలో పడుచువారిని, అందమైనవారిని రోమనులు తమ రాజధానీనగరమునకు గొనిపోయిరి. మిగిలిన వారు బానిసలుగ అమ్మబడిరి. క్రీ. శ. 70.వ సంవత్సరమున సంభవించిన యీ మహాసంక్షోభమున యూదులు తమకు చిర కాలమునుండియు మాతృభూమిగ నున్న పాలస్తీనమునుండి తరిమివేయబడిరి. అప్పటినుండియు వారి చరిత్రయందొక మహావిషాదకరమైన ఘట్టము ప్రారంభించుచున్నది. సుమారు పందొమ్మిది శతాబ్దుల కాలము వారు ప్రవాసదుఃఖమునకు లోనైరి. సుదీర్ఘమగు యూదులచరిత్రయందు ప్రథమఘట్టము ముగిసినది. దీనిని మనము ప్రాచీనయుగ మని వర్ణింపవచ్చును. ఈ యుగమునందు మనము యూదుల ప్రాచీనతమచరిత్రను, వారు ఈజిప్టుదేశమున కొన్ని శతాబ్దులకాలము నివసించుటయు, అచ్చట వారికి కల్గిన కష్టములును, మతప్రవక్తయగు మోజెస్ యాజమాన్యమున యూదు లీజిప్టు రాజ్యమునుండి వెల్వడి స్వతంత్రులగుటయు, యెహోవా మత స్థాపనమును, పాలస్తీన

మున యూదులు స్వాతంత్రరాజ్యమును నెలకొల్పుటయు, డేవిడ్ సాలమన్ ప్రభువుల రాజ్యకాలమున యూదుల కఖండ కీర్తి కల్గుటయు, ఆపైన నంతఃకలహములవలన యూదు రాజ్యము రెండుగ చీలిపోవుటయు, ఇస్రాయిల్ రాజ్యము నశించుటయు, యూదులు బాబిలోనియా రాజ్యమున కొంత కాలము బందీలుగ నుండుటయు, వారి బంధవిమోచనమును, గ్రీకులు పాలస్తీనముపై దండెత్తివచ్చుటయు, యూదుల మత మును సభ్యతను నాశనము చేసి, దాని స్థానమున గ్రీకు నాగరకతను నెలకొల్పుటకై వారి ప్రయత్నములును, తత్ప్రయత్నములు విఫలమగుటయు, యూదురాజ్యము మరల విజృంభించుటయు, రోమను రాజ్యముతో పాలస్తీనపు ప్రభువులు సంబంధములు కల్పించుకొనుటయు, యూదులలో మత విషయకములగు తీవ్రవిభేదములు కల్గి వారు రెండుపక్షములుగ చీలిపోవుటయు, పాలస్తీనపు ప్రభువులు రోమక సామ్రాజ్యము నకు సామంతు లగుటయు, మహనీయుడైన ఏసు క్రీస్తు జన నమును, ఆయన బోధలును, యూదురాజ్యము రోమక సామ్రాజ్యమునకు సామంతరాజ్య మగుటయు, యూదులు పాలకులగు రోమనులపై తిరుగుబాటు చేయుటయు, నా రిరు వురకును సంభవించిన ఘోరయుద్ధములును, జెరూసలేమ్ దుర్గము రోమనులకు వశ మగుటయు, యూదు దేవాలయము భగ్న మగుటయు, కుపితులగు రోమను లపారసంఖ్యలో యూదులను చంపి, మిగిలినవారిని బానిసలుగ నమ్మివేయుటయు

యూదులకు ప్రవాసదుఃఖము సంభవించుటయు మున్నగు నంశములను మనము తెలిసికొనియున్నాము. పై యుగము నందు యూదులకు ముఖ్యవృత్తి వ్యవసాయము. వా రనేక విధము లగు పైరుపంటలను పండించి తమ యవసరములను సరిపుచ్చుకొనుటయే కాక, ఈ ధాన్యముల నితర దేశములకు కూడ పంపుచుండెడివారు. కాని సమీపమందలి ఇతరజాతులు, అరబ్బులు, సైరు దేశీయులు, మున్నగువారివలె యూదులు స్వయముగ వ్యాపారము నెన్నడును సాగించియుండలేదు. కావున బాహ్యప్రపంచముతో వీరికి విశేషము సంబంధము లేర్పడలేదు. యూదు లేకాలమునందును కూడ సముద్ర యానమందు విశేషసామర్థ్యము చూపలేదు. వీరికి తమ దేశమే స్వర్గము. ప్రపంచజాతులలో తమ కొక వైశిష్ట్యత కలదనియు, తమ మతమే ఉత్తమోత్తమమైన దనియు వారు దృఢముగ విశ్వసించియుండిరి. ఆ కారణమున వారు స్వదేశ మును వీడి బహిఃప్రపంచములోనికి పోకుండుటయు, ఇతరులతో సంబంధములు కల్పించుకొనకుండుటయు సంభవించెను. యూదులు విజ్ఞానప్రియులుగ నుండిరి. ప్రాచీనకాలమున వారు జ్యోతిషము, ప్రకృతిశాస్త్రము మున్నగు విజ్ఞానశాఖలయందు చక్కని ప్రవేశమును సంపాదించినట్లు నిదర్శనపూర్వకముగ తెలుపవచ్చును. లలితకళలయందు ప్రాచీనకాలపు యూదులు విశేషసామర్థ్యమును చూపిరి. ఆ కాలమున వారు రచించిన ప్రార్థనాగీతములవలన వారి కవితాశక్తి చక్కగ వ్యక్తమగు

చున్నది. యూదులు మిక్కిలి సరళమగు భాషలో హృదయము నకు గాఢముగ నాటుకొను భావములను అద్భుతమగు కళా దృష్టితో వ్యక్తీకరింపగల్గియుండిరి. ఈ యంశమును పాశ్చాత్య విమర్శకులు పలువురు పునఃపునః ప్రశంసించియున్నారు. తమ ప్రార్థనాదికముల కంగముగ వారు సంగీతమును కూడ వృద్ధి పొందించిరి. జెరూసలేమ్ పట్టణమున నిర్మింపబడిన అద్భుత మగు దేవాలయ మూ ప్రాచీనకాలపు నిర్మాణములలో మిక్కిలి విఖ్యాతిగాంచియుండెను. కాని దీనిని నిర్మించిన గౌరవము టైరు పట్టణమునుండి వచ్చిన శిల్పులకే ముఖ్యముగ చెందు చున్నది. యూదుప్రజలలో ముఖ్యముగ కానవచ్చుచున్నట్టియు ఇతర ప్రజలకు వారియెడ గౌరవమును కల్గించుటకు కారణ ములైనట్టియు గుణములు వారి అపరిమితమైన ఆత్మవిశ్వా సము, అపారమగు ధర్మానురక్తి, దేశభక్తియు, అచంచలమగు కార్యదీక్షయు, అప్రతిహతమగు పరాక్రమము నని తలుపవ చ్చును. ఈ సద్గుణములే వారనేకశతాబ్దుల కాలము వర్ణనాతీత ములగు కష్టముల ననుభవించియు నేటివరకును జీవించియుండ గల్గుటకు కారణము.

మానవ సంస్కృతీ నాగరకతలకు యూదులొసగ్గి అలం కారముల నొసంగిరో వివరముగ మరియొక గ్రంథముఖమున పాఠక మహాశయులకు తెలుపగలమని మనవి చేయుచు యింతతో ముగించుచున్నాను.



**మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA117B199 |
| పుస్తకం పేరు | యూదుల చరిత్ర |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 151 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 16B, 64B, |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Aswini |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | Hema |
| పరీక్ష చేసినది | RAMYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |